బొమ్మల

# భగత్ సింగ్

**(1907 - 1931)**




మలయశ్రీ

నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్ * విజయవాడ-520002.

# మా స్వంత ప్రచురణలు

బొమ్మల శ్రీ షిర్డీసాయి జీవిత చరిత్ర
" అక్బర్ బీర్బల్ వినోద కథలు
" తెనాలి రామకృష్ణుని సంపూర్ణ హాస్య కథలు
" ఆలీబాబా 40 దొంగలు
" అల్లావుద్దీన్ అద్భుతదీపం
" గలివర్ సాహస యాత్రలు
" శ్రీ శ్రీ శ్రీ మర్యాదరామన్న కథలు
" భట్టి విక్రమార్కుని సాహస కథలు (2 భాగాలు)
" భేతాళ కథలు
" మొగల్ సామ్రాజ్య కథానాయకులు
" ప్రవక్త మహమ్మద్
" ఏసుక్రీస్తు కథలు
" మథర్ థెరిసా
" రవీంద్రనాథ్ ఠాకూర్
" యోగివేమన
" భగత్ సింగ్
" అంబేద్కర్
" యశపాల్ కపూర్
" భగవతీచరణ్
" సుభాస్ చంద్రబోస్
" చంద్రశేఖర ఆజాద్
" జయప్రకాష్ నారాయణ్
" సంఘసంస్కర్త రాజా రామమోహనరాయ్
" పూజ్యబాపూజీ

బొమ్మల పంచతంత్రం (2 భాగాలు)
" రామాయణం
" భాగవతం
" దశావతారాలు
" శ్రీకృష్ణ లీలలు
" పరమానందయ్య శిష్యులు
" శ్రీ వెంకటేశ్వర లీలలు
" శ్రీ అయ్యప్ప లీలలు
" శ్రీరామపట్టాభిషేకం
" జై వీరహనుమాన్
" పల్నాటి వీరచరిత్ర
" బాలనాగమ్మ
" శ్రీ కాళహస్తి మహాత్మ్యం
" శ్రీశైలక్షేత్రమహాత్మ్యం
" శ్రీ సింహాచలక్షేత్రము
" శ్రీ యాదగిరి నరశింహస్వామి చరిత్ర
" శ్రీ కాశీ రామేశ్వర మజిలీల కథలు
" కోటప్పకొండ చరిత్ర
" శ్రీ వినాయక విజయము
" శ్రీ భద్రాచల మహాత్మ్యం
" శ్రీ పాండురంగ లీలలు
" కనకదుర్గ మహాత్మ్యం
" శివలీలలు



నేను సైతం ప్రపంచాగ్నికి
సమిధ నొక్కటి ఆహుతిచ్చాను ।
నేను సైతం విశ్వసృష్టికి
అశ్రు వొక్కటి ధారపోశాను ।।।
నేను సైతం భువన ఘోషకు
వెర్రి గొంతుక విచ్చి మ్రోగాను ।।

"శ్రీ శ్రీ"

"స్వాతంత్ర్య మా జన్మహక్కు"

—తిలక్.

"స్వాతంత్ర్యం దానం మాదిరి ఒకరి నుండి స్వీకరింప బడదు. అలా స్వీకరించినా అది విలవదు. స్వాతంత్ర్యం కోసం మన హృదయ రక్తం మర్పించి దానిని పొందాలి."

— గాంధీజీ.

"ఒక మానవుని మరో మానవుడు దోచుకోవడానికి వీలులేని న్యాయ సమ్మతమైన ఆర్థిక వ్యవస్థను స్థాపించడంకోసం మేం క్రాంతిని ఆహ్వానిస్తున్నాం."

—భగత్‌సింగ్.



"ప్రజలు పరప్రభుత్వంతో పోరాడడానికి ఆత్రుత పడుతున్నారు. క
స్వరాజ్యం అంటే ఏమిటి ?ఎలా వుంటుంది అనేదాన్ని గురించి గాంధీగారు క
ఎలాంటి వ్యాఖ్యానమూ చేయలేదు."

—డా॥ పట్టాభి సీతారామయ్య.

(నేషనల్ కాంగ్రెస్ హిస్టరీ-పే॥ 376.)

"గాంధీజీ ఉద్దేశం ఏమిటో నాకు అర్థం కాలేదు. రహస్యా
ముందుగా ప్రకటించడం వారికి ఇష్టం లేదో, లేకపోతే ఆంగ్ల ప్రభుత్వాన్ని ఎ
ఓడించాలో వారికీ తెలియదేమో-"

—నేతాజీ సుభాశ్చంద్రబోస్.

(ఇండియన్ స్ట్రగుల్-పే. 38.)

"మన నాయకులు ఎవరుకూడా 'స్వరాజ్యం' అంటే పర ప్రభుత్
నుంచి స్వతంత్రాన్ని పొందడం అనుకోవడం లేదు. ఈ విషయాన్ని గురి
గాంధీగారు మౌనంగానే వున్నారు. పైగా స్వరాజ్యం యొక్క అభిప్రాయా
విడమరచి స్పష్టంగా చెప్పడం వారు అవసరం అనుకోవటం లేదు—ఏమైనా క
గాంధీగారిని మేం అద్వితీయ నాయకునిగా భావిస్తున్నాము. వారి మీద పూర్తి
విశ్వాసముంది. కళ్ళు మూసుకొని వారిని అనుసరించడానికి సిద్ధంగా ఉన్నాము."

—జవహర్‌లాల్ నెహ్రూ.

(ఆత్మ కథ పే-76, 73.)

"మానవుల్లో భయమూ ఆత్మ రక్షణకు ప్రయత్నించడమూ సహజ ప్రవృత్తులు. ఈ సహజ ప్రవృత్తులకు వ్యతిరేకమైంది ఆత్మహత్య ! విప్లవాన్ని ఆత్మరక్షణతో పోల్చుకుంటే, సత్యాగ్రహాన్ని ఆత్మహత్యకు పోల్చవచ్చును. ఆత్మహత్యా సదృశమైన అసహజమార్గంలో నడవగలవారు ఒకరో ఇద్దరో ఉండ వచ్చును. వాళ్ళయినా వెనుకనుండి ప్రజల సానుభూతి తమకు అందగా వుందన్న విశ్వాసం వున్నప్పుడే ఆ మార్గాన నడవగలరు."

—యశపాల్.

"విప్లవకారులమైన మేము విప్లవం ద్వారానే ఈ దేశ ప్రజలకు దాస్య విముక్తి కలుగుతుందని అనుకుంటున్నాము. విప్లవం అంటే మా ఉద్దేశ్యంలో పర ప్రభుత్వంతో పోరాడటం మాత్రమేకాదు. మా విప్లవానికి ఆదర్శం న్యాయ సమ్మతమైన ఒక క్రొత్త సమాజాన్ని స్థాపించడం. పెట్టుబడిదారీ విధానాన్ని నాశనంచేసి, వర్గ రహితమైన సమాజ వికాసానికి దోహదం చేయడం-విదేశీయుల దోపిడీ నుండి, దేశీయుల దోపిడీ నుండి ప్రజలను కాపాడి, వారికి స్వయం నిర్ణ యాధికారాన్ని ఇవ్వడం మా విప్లవానికి ఆదర్శం-"

—ఆజాద్.

# భగత్ సింగ్

ఏ జాతి తన శక్తిని, చరిత్రను మరచిపోతుందో, అది స్వార్థం కో మతం కోసం, ఈర్ష్యాద్వేషాలతో పరస్పరం కొట్లాడుకుంటుంది, అనైక్య లోనై చీలుతూ నిర్బలమై ఆత్మ వినాశనం పాలవుతుంది.

ఐక్యత బలం, అది లోపించినప్పుడు అగచాట్లే ఫలం. ఆ కార వల్లనే మన భారతదేశం మొదట వెయ్యేండ్ల క్రితమే ముస్లింలకు, పిదప రె వందల యేబదేండ్లకు పూర్వం ఆంగ్లేయులకూ లోబడింది.

బ్రిటిష్‌వారి కర్కశ పాలన, కూటనీతి, దోపిడి, "న భూతో న ష్యతి" అనేలా వుండేవి. కానయితే వారివల్ల కొన్ని సాంఘిక దురాచారాల రణ, రైలు-బస్సు మార్గాలు, విద్యావ్యాప్తి జరగొచ్చు. అదయినా యెందుకు స్వార్థ ప్రయోజనం కోసం.

ఏది ఏమయినా ఆ కాలంలో వ్యక్తి స్వేచ్ఛ లోపించింది. కుటీర

శ్రమలు కుంటుపడినై, ప్రతిభకు గుర్తింపులేదు. ఆర్థిక స్థితిగతి క్షీణించింది. బ్రతుకుకోసం బాధలు, ప్రభుత్వంచేత కష్టాలు సంప్రాప్తించినయ్ జనానికి.

అట్టి పరిస్థితిలో ఒకవైపు కాంగ్రెసు మహానేతలు స్వరాజ్యంకోసం శాంతి పోరాటం సాగిస్తుండగా, మరోవైపు సాయుధపోరాటం ద్వారా దేశ స్వాతంత్ర్యం సాధించ పూనుకొన్నారు మరికొందరు వీరయువకులు. అట్టి క్రాంతికారుల్లోని ఒక అమరవీరుడు సర్దార్ భగత్‌సింగ్. ఇది భరతజాతికే గర్వకారణమైన ఆ దేశభక్తుని జీవిత చరిత్ర!

## కుటుంబం

భగత్‌సింగ్ తండ్రి కిషన్‌సింగ్, తాత అర్జున్‌సింగ్. వారు సిక్కు-మతస్థులయినా సర్దార్ అర్జున్‌సింగ్ ఆర్య సమాజ సిద్ధాంతాలను అభిమానించాడు. అది సిక్కు ధర్మానికి భిన్నమైనది. హిందూ వైదిక ధర్మంలోని వర్ణ విభేదాలను పాటించకుండా పురాణకాలంనాటి విగ్రహారాధనలు లేకుండా వేద ధర్మాన్ని-హిందూ దేశాన్ని అనుసరించడం అభిమానించడం ఆర్య సమాజ సిద్ధాంతాలు. దయానంద సరస్వతి ఈ ధర్మ సిద్ధాంత ప్రచారకుడు. వేద ధర్మం క్రీస్తుకు పూర్వం కొన్ని వేలేండ్లనాటిది.

ఇస్లాంమతం క్రీస్తుకు తర్వాత కొన్ని వందలయేండ్లది.ముస్లింలు ఉత్తర భారత దేశాన్ని పరిపాలించే కాలంలో నీతి-దీక్ష-త్యాగం మూల సిద్ధాం

తాలుగా గురునానక్ హిందూ ముస్లిం సమైక్యతా ధర్మంగా (15వ శతాబ్దిలో) సిక్కు మతం రూపొందించాడు. పదవ గురువైన గురుగోవింద సింగ్ మొగల్ పాదుషా ఔరంగజేబు క్రూరత్వం కారణంగా క్షాత్ర వృత్తితో కేశపాలన ఖడ్గ ధారణ ఆ జాతికి తప్పనిసరి ఆచారం చేశాడు.

సర్దార్ అనేది భగత్‌సింగ్ కుటుంబానికి బిరుదు నామం కాదు. ప్రతి సిక్కు వ్యక్తినీ సర్దార్ అనొచ్చు. ఆ పదానికి పెద్ద అని అర్థం. సిక్కు అంటే శిష్యుడు. వారికి గురువే దైవం. ఏ విగ్రహాన్నీ కాక, గురునానక్ ధర్మ ప్రబోధ గ్రంథం "గ్రంథ సాహెబా"ను ఆరాధిస్తారు. వారి దేవళాన్ని "గురుద్వారా" అని పిలుస్తారు.

విద్యావతి, కిషన్‌సింగ్ దంపతులకు 27 సెప్టెంబర్ 1907తేదీన సర్దార్ భగత్‌సింగ్ జన్మించాడు.

వారి సొంత ఇల్లు "సాండా" గ్రామంలో వుంది. వ్యవసాయం పాల వ్యాపారం వల్ల కుటుంబ పోషణకు లోటులేని ఆదాయం వచ్చేది. వాటిమీదనే కిషన్‌సింగ్‌కు శ్రద్ధ ఎక్కువ. అయినా ఉపవృత్తిగా ఇన్సూరెన్స్ ఏజెంట్‌గా పని చేస్తూ లాహోరులో ఒక గది అద్దెకు తీసుకొని పోతూ వస్తూ వుండేవాడు.

వారి పూర్వీకులది పంజాబ్‌లోని హోషియార్‌పూర్ జిల్లా. చీనాబ్ నదికి కాలువలు త్రవ్వటంవల్ల లాయల్‌పూర్ జిల్లాకు మారినాడు.

కిషన్‌సింగ్ తమ్ములిద్దరూ తిరుగుబాటుదారులు. అతడు సోదరులకు రాజకీయాల్లో యెంతగానో సహకరించాడు. సాహసం ఆ కుటుంబానికి వెన్నతో



పెట్టిన విద్య; జన్మతో వచ్చిన గుణం. అందుకు యెన్నో బాధల ననుభవించారు. అయినా ధ్యేయం సడలలేదు. స్వభావం మారలేదు.

భగత్ జన్మకాలంలో కిషన్‌సింగ్ ప్రభుత్వ బహిష్కార శిక్షతో నేపాల్లో వున్నాడు. చిన్న తమ్ముడు స్వర్ణసింగ్ బర్మా జైల్లో ఉన్నాడు. అతడు భగత్ బాల్యంలోనే మరణించాడు. పెద్ద తమ్ముడు అజిత్‌సింగ్ తప్పించుకువెళ్ళి జర్మనీలో వున్నాడు. అతనిది వీర హృదయం. ఆంగ్ల ప్రభుత్వాన్ని గట్టిగా ఎది

రించాడు. అయినా బందీగా జైల్లో పడివుండడం ఇష్టంలేదు. విదేశాల్లో రహస్య జీవితం గడుపుతూ ఇతర విప్లవకారులతో సంబంధాలేర్పరచుకొని బ్రిటిష్ ప్రభుత్వ వ్యతిరేక కార్యకలాపాలలో పాల్గొనేవాడు. స్వతంత్ర భారతం అవతరించేవరకూ అదే పని కొనసాగించాడు. 1948లో ఇండియాకు వచ్చినా అనారోగ్యం కారణంగా త్వరలోనే మరణించాడు.

## బాల్యం

భగత్‌సింగ్‌కు ఒక అన్న జగత్‌సింగ్. అతడు పదకొండవ ఏటనే మరణించాడు. ఒక చెల్లెలు. ఆమె అంటే భగత్‌కు ప్రాణం ఆమెకూ అంతే. తమ్ముడు కుర్తార్ సింగ్.

భగత్ బాల్యం అల్లారుముద్దుగా గడిచిపోయింది. ప్రాథమిక విద్య అదే గ్రామంలో పూర్తిచేసి ఉన్నత విద్యకు లాహోర్ వెళ్ళాడు.

అతనికి అత్యంత ఆనందప్రదంగా వుండేది "వైశాఖిమేలా" అది మన ఆంధ్రులకు (కన్నడీయులకు-మరాఠీలకు) ఉగాది పర్వదినం లాంటిది. ఆ దినం ఊరివెలుపల తోటల్లో పచ్చిక మైదానాల్లో విందులు గుడుస్తారు. కలిగినంతలో ఇరుగు పొరుగువారిని పేదసాదలను ఆహ్వానిస్తారు, ఆ వేడుకలో ఉత్సాహంగా పాల్గొని బాల భగత్ తల్లికి చేదోడు వాదోడుగా మెదులుతూ ఇతరులకు రొట్టెలు కూర పంచుతూ ఆనందించేవాడు. వైశాఖి ఉత్సవం అతనికి చెరిగిపోని స్మృతి.

అలాగే "బసంతీ" (వసంత) గీతాలన్నా చాల ఇష్టం.

## విప్లవ బీజాలు

పంజాబీయులని సహజంగానే వీరజాతి. యెక్కువమంది ప్రభుత్వ సైన్యాల్లో చేరుతుంటారు-అప్పుడేకాదు ఇప్పటికినీ, అందులో భగత్ కుటుంబం దేశభక్తికీ, సాహసానికీ పెట్టింది పేరు.

భగత్ బాల్యంలోని "రౌలత్ చట్టం" వ్యతిరేక ప్రదర్శన అతని మనస్సులో ఆంగ్ల ప్రభుత్వ వ్యతిరేక బీజాలు నాటింది. అప్పుడతడు డి.ఎ.వి. (దయానంద్ ఆంగ్లో వైదిక్) స్కూల్ విద్యార్థి.

1919లో "రౌలత్ బిల్లు"కు వ్యతిరేక ప్రదర్శనలు దేశమంతటా పెద్ద ఎత్తున జరిగాయి. ప్రజల వ్యతిరేకతకు అంతగా కారణం అది ఆంగ్లేయ ప్రభుత్వం చట్టబద్ధం చేస్తున్న 'మీసా' చట్టం. ప్రజా హక్కులను భంగపరచేది.

లాహోర్‌లో ఏడురోజులు సంపూర్ణంగా బంద్ పాటించారు. జనం గుంపులు గుంపులుగా ఊరేగింపులు తీసేవారు. రౌలత్ చట్టాన్ని నిందిస్తూ ఏడుస్తూ పాటలు పాడేవారు. పోలీసులు బలవంతంగా తెరిపించిన దుకాణాలు మూసివేయించేవారు. వారు అంటించిన పోస్టర్లను వారటు పోగానే వీరిటు చించివేసేవారు. ఆందోళన కారులను శిక్షిస్తామని ప్రభుత్వం హెచ్చరించినా ప్రజలు లెక్కించలేదు.

రౌలత్ చట్టాన్ని 19వ శతాబ్ది చివర్లో (1885) పుట్టిన కాంగ్రెసు, 20వ శతాబ్ది మొదటి (1906) ముస్లింలీగ్‌తో సహా అన్ని పార్టీలు వ్యతిరేకించాయి. 1916 లోనే హోంరూల్ ఉద్యమం తిలక్, అనిబిసెంట్ మొ॥ వారిచే ఆరంభ మైంది. అనిబిసెంట్ కోరింది బ్రిటిష్ చక్రవర్తిత్వానికి లోబడి ఉండే భారత స్వాతంత్ర్యం మాత్రమే. అందుకు భిన్నంగా కాంగ్రెసు కనిపించేసరికి ఆమె వైతొలగి పోయింది. కాంగ్రెసు స్థాపనే ఆంగ్లప్రభుత్వ సహకారంతో 'హ్యూం' దార స్థాపించాడు. బెనర్జీని మొదటి అధ్యక్షుని చేశాడు. బ్రిటిష్ ప్రభుత్వానికి విధేయత ప్రకటించటం దాని మొదటి లక్షణం. దేశీయులకు కొన్ని కోర్కెలు సాధించటం రెండవ లక్షణం. దేశభక్తిని ప్రక్కదారి పట్టించడం మూడవ లక్షణం. 1906 కలకత్తా సభల్లోనే కాంగ్రెసు రెండుగా చీలిపోయింది. 1907లో అతివాద కాంగ్రెసు నాయకుడైన లాలాలజపతిరాయ్‌కు ప్రభుత్వం దేశబహిష్కారశిక్షవిధించింది. 1929 లాహోరు సభలకు జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షుడై సంపూర్ణ స్వాతంత్ర్య సాధన తమ పార్టీ ప్రధాన లక్ష్యంగా ప్రకటించేవరకు కాంగ్రెసు స్థిర నిర్ణయంలో లేదు. 1922 బార్డోలీ సత్యాగ్రహంవరకు గాంధీజీ శాంతి-అహింసలు తమ ఉద్యమ ముఖ్య సాధనాలుగా ప్రకటించలేదు సత్యాగ్రహం, సహాయ నిరాకరణలనే స్వీకరించేవాడు. ప్రజలు తమకు నచ్చిన మార్గాల్లో ప్రభుత్వానికి తమ అసమ్మతిని తెలిపేవారు, దేశ ప్రజల్లోనే కాక కాంగ్రెసులోనూ తీవ్రవాదులే యెక్కువ.

అందుకే అధిక్రమంగా తిలకు, లాలాజీ, చిత్తరంజన్, మోతీలాల్, సుభాశ్చంద్రబోసులతో చీలుతూ పోయింది. స్వతంత్రం 15 ఆగస్టు 1947 తర్వాతి

చీలికల పరిస్థితులు కారణాలు వేరు. అంతకుముందు కేవలం పార్టీ లక్ష్యాలనిర్ణయం (ప్రకటన) విషయంలోనూ, స్వరాజ్య సాధన విధాన విభేదాల వల్లను చీలుతూ వచ్చింది.

1915 లో ఇండియాకు దక్షిణాఫ్రికానుంచి వచ్చాడు గాంధీజీ. అవి దేశంలో ఉగ్రవాదం విచ్చుకత్తులు జళిపిస్తున్న రోజులు. భారతదేశ విముక్తికోసం అమెరికా 'శాన్‌ఫ్రాన్సిస్కో' నుంచి సాయుధపోరాటానికి సంసిద్ధమై వచ్చిన (1915) గదర్ విప్లవ వీరులు పట్టుబడి శిక్షలపాలైన 'మొదటి లాహోరు' కుట్ర జరిగిన సంవత్సరం. అదే సంవత్సరం బెంగాళ్ క్రాంతికారుడు జతీంద్రనాథ ముఖర్జీ దేశ స్వాతంత్ర్యంకోసం టెర్రరిస్టు ఉద్యమం సాగించాడు. 1910 లో నాసిక్ కుట్రకేసులో వీరవినాయక సావర్కార్ శిక్షపాలయితే, 1909లో అలీపూర్ కుట్ర కేసు అరవిందఘోషుపై నడిచింది. 1910 లోనే 'మేడంకామా' విప్లవకారిణిగా మారి విదేశాల్లో ఉంటూనే సాయుధపోరాటాన్ని నడిపి ఆంగ్లేయులనుండి స్వతంత్రం తెచ్చుకోవాలని తన భారత దేశీయులకు హెచ్చరిక చేసింది. విదేశాలలో స్వదేశ స్వతంత్రపతాకం రూపొందించి ఎగురవేసిన ఆమె నడిపించిన పత్రిక పేరు 'వందేమాతరం'. మన మహాత్ముడు స్థాపించి నడిపిన పత్రిక 'యంగ్ ఇండియా'. అప్పుడాయన వయస్సు యాభైకి చేరువ.

ఇటువంటి పరిస్థితుల్లో భారతదేశం వచ్చి కాంగ్రెసులో చేరిన గాంధీని విదేశంలో వచ్చిన పేరునుబట్టి వైస్రాయి యుద్ధ కౌన్సిల్‌కు ఆహ్వానించాడు. అవి 1914-18 ప్రపంచయుద్ధం జరుగుతోన్న రోజులు. బ్రిటన్ ఆ యుద్ధంలో పాల్గొ

న్నది. ప్రమాదంలో ఉండగా నే దెబ్బతీసి స్వాతంత్ర్యం సాధించుకోవాలనే దేశీయుల కోర్కెకు భిన్నంగా గాంధీజీ ఆంగ్ల ప్రభుత్వానికి మద్దతు చేస్తానన్నాడు. అది మన నైతికబాధ్యత అని దేశనాయకులకు నచ్చచెప్పాడు. యుద్ధ ప్రమాదం తప్పి విజయం పొందితే బ్రిటన్ మన ఉపకారానికి ప్రత్యుపకారంగా తప్పక స్వతంత్రం ఇచ్చితీరుతుందని ఆశించాడు.

తాను దేశంలో ముఖ్యంగా గుజరాతులో పర్యటించి వేలమంది యువకులను బ్రిటిష్‌వారి సైన్యంలో చేర్పించి ప్రపంచ యుద్ధరంగానికి పంపాడు. అప్పటికి యుద్ధం చేయకూడదు-చేయించకూడదు అనే అహింసావాదం శాంతిమంత్రం అయ



నను చేరలేదనుకోవాలి. తీవ్రమైన కరువువల్ల, గాంధీ బోధలవల్ల పెద్ద సంఖ్యలోనే సైన్యంలో చేరారు భారతీయులు.

యుద్ధం ముగిసింది. బ్రిటన్ గెలిచింది. గాంధీజీ ఆశ నెరవేరలేదు. కాంగ్రెసు నిరాశపడింది. తీవ్రవాదులు 'చెపితే వింటివ గురూ' అని నవ్వుకున్నారు.

1917 లో రష్యా ప్రజా విప్లవం విజయం కాంచింది. ప్రపంచ యుద్ధ కారణంగా విశ్వరాజకీయాలు దేశంలో వేగంగా వ్యాప్తి చెందుతున్నాయి. బానిస తనంలో ఉన్న దేశయువకుల బుర్రలు తీవ్రంగా పనిచేస్తున్నవి.

పంజాబు యువకులు కొందరు రష్యావెళ్ళి విప్లవసాహిత్యాన్ని తెచ్చు కున్నారు. బెంగాళ్ దీనిలోనూ ముందే. 1905 బెంగాళ్ విభజనతో రగులుకున్న ఆంగ్లద్వేషం 1907లో విప్లవోద్యమాలకు దారితీసింది.

గాంధీజీ చర్యకు దేశీయులు అసంతృప్తి చెందారు. దేశంలో ముఖ్యంగా యువతలో వేడిగాలి వీచసాగింది. ఆంగ్లేయులకు అది చూసి అను మానం వేసింది. ఈ గాలివేడి రష్యా ప్రభావంవల్ల కాదుకదా అనుకున్నారు-భయ పడ్డారు. ఆంగ్లేయులు శీతల దేశవాసులుకదా-మెల్లగా చాపక్రింది నీరులా ముందుకు సాగేగుణం కలవారు.

ఊరుకుంటే ఉత్తమంకాదని 'రౌలత్ ఆక్టు' తెచ్చింది ఆంగ్లప్రభుత్వం.

తన ఇంటి (చిన్నాన్నల) విషయాలే కాక ఇలా దేశపరిస్థితులనూ గమనించాడు పదమూడేండ్ల బాలభగత్. అదే సందర్భంలో జరిగిన ఒక ఘోర సంఘటన భగత్‌సింగ్‌పై తీవ్ర ప్రభావాన్ని పడవైచింది. అదే-

# జలియన్ వాలాబాగ్ దురంతం

1917లో వైస్రాయి సమావేశంలో గాంధీజీ సైతం రాజకీయాల్లో ప్రవేశించినట్లయింది- పేరువచ్చింది.

రౌలత్ చట్టాన్ని వ్యతిరేకించాడు.

పంజాబ్ నిరసన ప్రచండరూపం ధరించింది. 12 ఏప్రిల్ 1919 దినాన 'అమృతసర్'లో పెద్ద ఊరేగింపు తీశారు, రౌలత్ చట్టానికి వ్యతిరేకంగా నినాదాలు చేస్తూ. జనాన్ని చెదరకొట్టటానికి విచక్షణలేకుండా పోలీసులు కాల్పులు జరిపారు. అందులో ఇద్దరు మరణించారు. అప్పటికి ప్రదర్శన ఆగింది.

మరునాడే 'వైశాఖిమేలా' (ఉత్తర భారతీయులకు సంవత్సరాది) పర్వ దినం ప్రభుత్వపు కాల్పులకు నిరసనగా ఉద్యమకారులు సమావేశాన్ని ఏర్పాటు చేశారు, పట్టణంచుట్టూ పోలీసుల డేరాలు విడిసి ఉన్నాయి. సమావేశం స్థలం దొరకడం కష్టమయింది. నగరంలోని ఓ మూలగా 'జలియన్‌వాలా బాగ్' అనే విశాల మైదానంలో సభ ఏర్పాటుచేశారు. దానికి నాలుగువైపులా ఎత్తయిన గోడలు, రెండే ఎత్తయిన గొందులు ప్రవేశమార్గాలు.

సాయంత్రం సమావేశ సమయానికి ముందే జనంతో సభాస్థలం క్రిక్కిరిసి పోయింది. రాజకీయ పరిజ్ఞానం కలవారు తక్కువ. ఇదే ఉత్సవ స్థలమేమో

అని ప్రక్కూళ్ళనుండి పండుగ వేడుక చూడడానికి పిల్లాపాపలతో వచ్చినవాళ్ళు చేరిందెక్కువ.

సభ ప్రారంభమయింది. ఇది ఇదా అని నచ్చని వాళ్ళు వెళ్ళిపోదామన్నా అడుగు పెట్టటానికి వీళ్ళేనంత జనం.

అకస్మాత్తుగా రెండు ప్రవేశమార్గాలనుంచి కాల్పులు ఆరంభమైనవి. జనం కల్లోలమయింది. త్రొక్కిసలాడింది. ఎటుచూసినా బయటపడే దారిలేదు.

ఏడ్పులు పెడబొబ్బలు-తుపాకి దెబ్బలతో రక్తపు మడుగుల్లో పడి పొర్లడం. అతి ఘోర-భయంకర సన్నివేశం, నిరాయుధులైన భారతీయులపైన 16 వేల రౌండ్ల తుపాకి కాల్పులు. 379 మంది అక్కడికక్కడే మరణించారు. వేలమంది గాయపడ్డారు.

పత్రికలన్నీ (1915 లోనే 478 స్వదేశ పత్రికలట) ఈ మారణ కాండను గర్హించాయి. నాయకులు నిరసన తెలిపారు. పలువురు ప్రముఖులు వచ్చి చూసి కన్నీరు కార్చారు. ప్రజలు దుమ్మెత్తిపోశారు.

ప్రభుత్వానికి చీమకుట్టినట్లయినా లేదు. వాళ్ళు దైవకుమారులు! వీళ్ళు బానిసలు, సర్కస్ జంతువులు, అనాగరికులు, ఆటవికులు ఆ నాగరిక వేటగాళ్ళు తమ ఇష్టంవచ్చినట్లుగా వీరిని హింసించవచ్చు చంపవచ్చుననే భావం వారికుంది. దేశనాయకుల అభ్యర్థనకు విచారం జరుపుతామన్నాడట వైస్రాయి. అక్కడికే చల్లబడింది కాంగ్రెసు. కాని దేశంలోని యువకుల ఉద్రేకం చల్లారలేదు. ఆకోపం

విష్ల వాదులను చేసింది. తెల్ల వారిపై ద్వేషాన్ని పెంచింది. ప్రతీకారానికి హెచ్చరించింది.

ఈ కాల్పులకు కారకుడైన పంజాబ్ గవర్నర్, ఏప్రిల్ 13 నాడు కాల్పులు జరిపితే, మే 26న, తన గవర్నర్ పదవికి రాజీనామాచేసి 30 మే నాడు ఓడెక్కి భారతదేశాన్ని వదలి ఇంగ్లాండుకు పారిపోయాడు. భారత వీరులంటే అంత భయం బడుద్దాయలకు అయినా వెడుచేయక ఊరోగ్కారు-స్వార్థం!

ఆంగ్ల ప్రభుత్వం మైకేల్ చేసిన ఘనకార్యానికి సంతసించి 2 లక్షల రూపాయలతో ఘన సత్కారం చేసింది. ఇక సుఖంగా బ్రతకుదా మనుకున్నాడు నీచుడు స్వదేశంలో తమ ప్రభుత్వం రక్షణలో. కాని వాని చరిత్ర మరోతీరుగా మారనుంది వాడికేం తెల్సు.

ఆ హింసను కళ్ళారాచూసి, ఈ సన్మానాన్ని వీనులారా విని రక్తం వేడెక్కి ఉద్రేకం పొంగులు పొరగా 21 ఏండ్లుగా రగులుతున్న పగతో 'ఉద్ధం సింగ్' అనే పంజాబీ యువకుడు లండనువెళ్ళి వేచిఉండి 1940 ఏప్రిల్ 14 నాడు ఒక నిండుసభలో కాల్చివేశాడు.

మైకేల్ చేసిన దుష్కార్యానికి పైన (ఉన్నాడంటున్న) పరమప్రభువు శిక్షను విధించేవాడో లేదోకాని ఒక వీరభరత పుత్రుడు న్యాయసమ్మతమైన శిక్ష విధించాడు. 12 జూన్ 1940 నాడు ఆ వీరునికి (41 సం॥ వయస్సు) పరదేశ ప్రభుత్వం ఉరిశిక్ష విధించినా నిర్భయంగా తన దేశీయులకు వీరసందేశం ఇస్తూ పగ చల్లారిన తృప్తితో మృత్యువు కౌగిటచేరాడు.

కాల్పులు జరిగిన మరునాడు వీరభగత్‌సింగ్ బడికివెళ్తున్నానని ఇంట్లో వారికి చెప్పి చక్కగా అమృతసర్ చేరుకున్నాడు. జలియన్ వాలాబాగ్‌లో దుఃఖంతో బుసలుకొడుతూ తిరిగాడు. అప్పటికి చెరగిపోని నెత్తుటి మరకలను చూసాడు. పిడికిడి నిండుగా రక్తంతో తడిసిన మట్టిని తీసుకొని వెనుదిరిగాడు.



అన్నంతినలేదు. ఎవ్వరితో ఏమీ మాట్లాడలేదు. గంభీరంగా ఉన్న అన్ననుచూసి మూసిఉన్న పిడికిడినిచూసి అతని సోదరి శకుంతల "ఏమిటన్నా

అది?" అని ప్రేమగా అడిగింది. గారాల చెల్లెలివైపు చూశాడు జాలిగా ఇలాంటి ప్రియమైన నా భారతదేశ వాసులు ఆ దుష్టుల ఘోర హింసాకాండకు ఎందరు బలియిపోయినారో కదా! అనుకున్నాడు. చేయివిప్పి చూపాడు?

ఏమిటిది ?

పగ !

ఎర్రమట్టి ?

కాదు నా తోబుట్టువుల రక్తం !

ఆ అమ్మాయి ఆశ్చర్యంతో నోరు తెరిచింది. భగత్‌సింగ్ క్రోధం శోకంగామారి కన్నీరు జార్చింది. కాని ఆంగ్లప్రభుత్వంపై ద్వేషం ఆనాడే రగులుకుంది.

## ఉద్యమాల ప్రవేశం

ఏడ్చేకళ్ళను తుడిచినట్లుగా (ఏడుపు కారణాలను పరిశీలించేదిలేదు. తెలిసినా వాటిని తొలగించే ప్రయత్నమూ లేదు.) ఏదో కాలయాపనగా కపట నటనగా ప్రభుత్వం 'మాంటెంగ్-చేమ్స్ఫర్డ్' సంస్కరణలు ప్రవేశ పెడతానని ప్రకటించింది. మొదటి ప్రపంచ యుద్ధంలో బ్రిటన్‌కు సహకరించి కాంగ్రెసు పలుసార్లు రాయబారాలు జరిపి అర్థిస్తే, అవి తమ కోరికల్లో వెయ్యోవంతుకూడా తీర్చేవి కావని గాంధీజీ అన్నాడంటే ప్రభుత్వ వైఖరి గమనించవచ్చు.

గుజరాతులో సబర్మతీ ఆశ్రమాన్ని నిర్మించుకొని ఋషి జీవితాన్ని గడుపుతున్న గాంధీకి రాజకీయాల్లో ప్రముఖస్థానం ప్రచారం కలిగింది. భారత దేశంలో పురాతన రాజరిక కాలంనుంచి మత గురువులు, సన్యాసులు ఎందరో రాజులకు ఉత్సాహాన్ని అందించారు. రాజ్యాలను పెంచారు-మార్చారు అందుకే మునివృత్తికి కాషాయ వస్త్రాలకు మనదేశంలో ఇప్పటికీ గౌరవముంది.

అతివాదులతో ఈసడింపబడుతున్న మితవాద కాంగ్రెసు పార్టీలో చే రాజకీయ ఉద్యమానికి తోడు నైతికశక్తిని జోడించి క్రమంగా అగ్రశ్రేణి నాయకు డయ్యాడు మహాత్ముడు.

కాంగ్రెసు చరిత్ర వ్రాసిన ఆంధ్ర నాయకుడు పట్టాభి సీతారామయ్య గారి అభిప్రాయం వినండి (1945 సుమారులో) "గాంధీ ఇరవై యేళ్ళు రాజకీయ రంగములో ఒక్క బిగువున నాయకత్వము వహించెను. ఒకప్పుడు కాంగ్రెసును నడిపే ప్రధాన నాయకుడుగానూ, మరొకప్పుడు కాంగ్రెసు ప్రాణ ప్రదుడుగానూ వ్యవహరించెను. గాంధీ కాంగ్రెసులో లాంఛన ప్రాయంగా సభ్యుడైనా, కా పోయినా, సత్యాగ్రహ ప్రయోగములలో ఆయనకు గల అనుభవములను బట్టి ఆయన సర్వకాల సర్వావస్థయందూ కాంగ్రెసుకు మార్గదర్శిగానూ, భారత దేశము నకు జ్ఞాన ప్రదాయకుడుగానూ, విశాల ప్రపంచమునకు మిత్రముగానూ నుండ గ గెను."

అటువంటి గాంధీజీ బ్రిటిష్ ప్రభుత్వరీతికి కినుకవహించి ఏడాదిలో డిసెంబర్ 1921 నాటికి తప్పక స్వరాజ్యం తెచ్చితీరుతానని ప్రతిజ్ఞచేశాడు-కా

గ్రేసును ప్రజలను తాను నడిపే సత్యాగ్రహ ఉద్యమానికి తోడ్పడుమని కోరాడు. ప్రజలు ఆయన చిత్తశుద్ధిని విశ్వసించారు. ఆశపడ్డారు. కట్టలు తెగిన ఉత్సాహంతో ఆయనను అనుసరించారు. ఉద్యోగులు, విద్యార్థులు తమ పట్టాలను చించివైచి చదువులు వదలిపెట్టి ఉద్యమంలో చేరారు. సహాయ నిరాకరణ సత్యాగ్రహాలు ముమ్మరమైనవి. వందేమాతరం, భారత్ మాతాకీ జై, మహాత్మాగాంధీకి జై, నినాదాలు మార్మోగినవి. పికెటింగ్‌లు, ఘోరావ్‌లు, లాఠీచార్జీలు, అరెస్టులు అంతా అదో గందరగోళం-ఉప్పెన!

అప్పుడే నూతన ఉత్సాహంతో భగత్‌సింగ్ సైతం తను చదువుతున్న తొమ్మిదవ తరగతికి స్వస్తిపలికి సత్యాగ్రహ ఉద్యమంలో చేరిపోయాడు.

గాంధీజీ 'బూర్డోలీ' సత్యాగ్రహాన్ని ఆరంభించాడు. 'చౌరాచౌరీ'లో ఉద్యమకారులు ఉద్రేకానికి లోనై యురోపియనులను హింసించారు. అందుకు బాధపడి ఆయన ఉద్యమాన్ని నిలిపివేశాడు. స్వరాజ్యం రాలేదు.

ఎంతో ఆశతో స్వార్థ ప్రయోజనాలన్నింటిని వదలి దేశం స్వతంత్రమైతే చాలని ఉద్యమంలో చేరినవారంతా నిరుత్సాహపడ్డారు.

కొందరు తిరిగి సంసారజీవితాల్లో ప్రవేశిస్తే కొందరు విద్యాలయాల ప్రవేశించారు. కొందరు దిక్కుతోచనివారై దిగాలుపడిఉంటే, కొందరు ఇదికాదు సరియైనమార్గం అది అని తీవ్రవాదపు సాయుధ పోరాటమార్గాన్ని ఎన్నుకున్నారు.

భగత్‌కు తిరిగి బడికి పోవాలనిపించలేదు. అప్పుడు అకాలీ ఉద్యమం పంజాబులో తీవ్రస్థాయినందుకున్న దశ. అతనికేం మతాసక్తిలేదు. అతనివాళ్ళ



పెంపకమే అలాగుంది. సిక్కు మతాచారులకు భిన్నంగా ఆర్యసమాజ అభిమానం తండ్రి తాతలనుంచి ఉందని ముందే తెలుసుకున్నాం.

ఇప్పుడు భగత్ "సత్ శ్రీ అకాల్" అని సిక్కు ధర్మప్రచారానికి పూనుకున్నాడు. క్రాపుగా కత్తిరించివున్న తన తల వెంట్రుకలు పెంచి ముడివేసుకున్నాడు. దానిని నల్లని గుడ్డతో కట్టేవాడు. ఇతర ప్రచారకులతోపాటు గ్రామాలకు బయల్దేరేవాడు. ఇంతకూ ఆ ఉద్యమం విశేషమేమంటే-ఆ కాలంలో గురుద్వారాలకు విపరీతమయిన ఆదాయాలు వుండేవి. వాటిని మత గురువులు విచ్చల

విడిగా తమ ఇష్టంగా ఖర్చుపెట్టేవారు. అలాగా కాక ఆలయాల నిధులను ప్రజల సంక్షేమ కార్యాలకు వినియోగించాలని అకాలీల ఉద్యమం ప్రచారం. ఒకరీతిగా మత నియంతృత్వానికి తిరుగుబాటు. రోమన్ కాథలిక్స్‌పై ప్రొటెస్టెంట్స్ పోరాటం లాంటిది.

అయినా కొద్ది కాలానికే ఆ ఉద్యమంలోనూ అతనికి ఉత్సాహం చప్ప బడి పోయింది. ఊరికే ఇంటిలో వుండేవాడు. తండ్రి ప్రోత్సాహంవల్ల పంజాబ్ నేషనల్ కాలేజీలో చేరాడు. అందులో చదివితే డిగ్రీలు వస్తాయి కాని ఉద్యోగాలు రావు. విజ్ఞానం వస్తుందికాని విత్తంరాదు. అయినా వారి దేశభక్తి అలాంటిది.

## పంజాబ్ నేషనల్ కాలేజీలో

స్వదేశ అభిమానంతో, విదేశీ చదువుల పద్ధతికి భిన్నంగా స్వరాజ్య సాధన స్ఫూర్తి కలిగించడంకోసం జాతీయ నాయకులు నేషనల్ కాలేజీలను స్థాపించారు. లాహోర్ కళాశాల లాలా లజపతిరాయ్ ఏర్పరిచాడు. భాయి పరమానంద్ నడిపించేవాడు.

ఇక్కడ ఖద్దరు మాత్రమే ధరించాలనే కాంగ్రెసు నియమం లేదు. తప్పనిసరిగా ప్రార్థనలో పాల్గొనాలనే గురుకుల విద్యాలయాల నియమ నిబంధనలూ లేవు. విద్యార్థులకు తగినంత భావస్వేచ్ఛ వుండేది. హాస్టల్ సౌకర్యముంది. వేరే వున్నా వద్దనేవారుకాదు. పంజాబ్‌లోని వివిధ ప్రాంతాలవారే కాక రోహతక్, హిసార్ నుంచి విద్యార్థులు వచ్చి చేరేవారు. మొదట పదవ తరగతి వరకే ఉన్న క్లాసులను పిదప బి.ఎ. వరకు పెంచారు.

ఆ కాలేజీలో చేరాడు భగత్‌సింగ్. అక్కడే అతనికి యశపాల్, సుఖదేవ్ మిత్రులైనారు. వారు ముగ్గురూ సర్దార్ కిషన్‌సింగ్ ఇన్సూరెన్సు ఆఫీసు గదిలో వుండేవారు. పలువురు విద్యార్థులు రాజకీయ శాస్త్రం, అర్ధశాస్త్రం, చరిత్ర చదివేవారు. పార్సీకూడా నేర్పేవారు. భగత్ మాత్రం సంస్కృత విద్యార్థి. అది వారింటి ఆర్య సమాజ ప్రభావం వల్ల; పైగా అతనికి సాహిత్యాభిరుచివుంది.

మెట్రిక్ ప్యాసయిన తరువాత గురుద్వారా ఉద్యమంలో కొన్నాళ్ళు గడిపి ఆలస్యంగా కాలేజీలో చేరినందున చదువులో వెనుకబడి వుండేవాడు ప్రొఫెసర్లతో చీవాట్లూ తినేవాడు. అయినా పట్టుదలతో పాఠాలు చదివి ఆ లోటు పూరించుకున్నాడు. కొంటె పనులకు ముందే. కాలేజీ మాస్టర్లను ఆటపట్టించేవాడు మిత్రులతో కలసి.

ఇలాగయితే ఎందుకూ పనికిరాకుండా పోతారు. రోహతక్ విద్యార్థులను చూసి పొదుపుగా అదుపుగా వుండటం నేర్చుకోండి. వాళ్ళు బుద్ధిమంతులు పైకి వస్తారు, దేశానికి పనికివస్తారు-అని అధ్యాపకులు వీరిని నిందిస్తూ వారిని ప్రశంసించేవారు. కాని తర్వాత వాళ్ళంతా సంసారాల్లో చేరి వ్యాపారస్తులూ, ఇతర వృత్తుల వాళ్లూ అయినారు. నిందలు పడిన వీళ్ళేమో దేశ స్వాతంత్ర్యం కోసం పోరాటం సాగించారు. అంచనాలకు, అనుభవాలకు ఎంతటి విపరీతం!

ఆ కళాశాల అధ్యాపకుల్లో జయచంద్ర విద్యాలంకార్ వీరితో విప్లవ బీజాలు నాటాడు. సమకాలీన రాజకీయాలు, గాంధీ సత్యాగ్రహంలోని లోటుపాట్లు, మతం చేస్తున్న అపకారం, ఇలా యెన్నెన్నో విషయాలు సహేతుకంగా వివరించేవాడు. తీవ్రవాదంలో విద్యార్థులకు ఆయన బోధన చాల రుచించేది.

అక్కడ వున్నకాలంలో భగత్‌కు విప్లవ చరిత్రలు చదివే అవకాశ లభించింది. డేన్ బ్రీన్ "ఐరిష్ స్వాతంత్ర్యంకోసం నా పోరాటం". వా త్రే రచన "ఫ్రెంచి విప్లవ చరిత్ర", మెజినీ-గైరిబాల్డీ జీవిత చరిత్రలు, రష్యా, భారత విప్లవ వీరుల చరిత్రలు, రూసో రచనలు చదివాడు. ఆ పుస్తకాలు ఆలోచనక పదును పెట్టినాయ్. సాంప్రదాయ పద్ధతికి తిరుగుబాటు నేర్పినాయ్.

ముఖ్యంగా దాదా సన్యాల్ "బందీ జీవన్" ఇంకా "రౌలత్ కమి రిపోర్టు" ఆ మిత్రులపై ప్రభావాన్ని చూపాయి. కాలేజీ లైబ్రరీనుంచేకాక,లాలా తన తండ్రి పేర స్థాపించిన "ద్వారకానాథ్ పుస్తకాలయం"లోనూ గడిపేవార మిత్రులు ఇతర చోట్లనుంచి పుస్తకాలు తెచ్చేవారు.



క్రమంగా భగత్‌సింగ్, సుఖదేవ్ విప్లవ కార్యాలవైపు మొగ్గితే య పాల్ కథారచనతో గడిపేవాడు.

అయినా భగత్ సాహిత్య రచనలో వెనుకపడలేదు. 1925లో పంజాబ్ "హిందీ సాహిత్య సమ్మేళన్" వారు నిర్వహించిన వ్యాసరచన పోటీలో యశపాల్ రచనకు సమానమైందిగా భగత్‌సింగ్ వ్యాసం మొదటి స్థానంలో ఎన్నికైంది బహుమతి యెవ్వరికీ ఇవ్వలేదు, యశపాల్ ఒక్క హిందీలోనే వ్రాస్తే భగత్ హిందీ, ఉర్దూ రెండు భాషల్లో వ్రాసేవాడు. లాహోరులో ఉర్దూ ప్రభావం ఎక్కువ. ఆ కాలంలో ఇతని రచనలు కొన్ని పత్రికల్లోనూ వచ్చాయి. పారితోషికం లేదు. ఆ కాలంలో ప్రచురించడమే గొప్ప. ఇప్పుడంత వ్యాపార దృష్టిలేదు రచయితలకూ ప్రచురణ కర్తలకూ.

కాలేజీలో చేరటానికి ముందు బక్కపలుచగా చిన్న కళ్ళతో మామూలు రూపంలో వుండే భగత్ కాలేజీలో చేరింతర్వాత ఒడ్డూ పొడుగూ యెదిగాడు. అందం మామూలే. రంగు చక్కనిది. రాజకీయ ఆలోచనల వల్ల మనిషిలో హాస్య ప్రవృత్తి తగ్గి కాస్త గాంభీర్యం చోటుచేసుకుంది.

లాలాజీ స్థాపించిన "తిలక్ స్కూలాఫ్ థాట్స్"-'సర్వెంట్స్ ఆఫ్ పీపుల్స్ సొసైటీ' లకు వెళ్ళేవారు. రష్యా విప్లవం (1917) ఈ మిత్రుల భావాల్లో మార్పు తెచ్చింది. ఆ 1925 కాలంలోనే 'హిందూస్థాన్ ప్రజాతంత్ర దళం' వారి కరపత్రాలు సహితం రహస్యంగా పంచారు. అందుకు వీరికి తోడ్పడిన వారు జయచంద్ర విద్యాలంకార్, భగవతీ చరణ్. చరణ్ అదే కాలేజీలో భగత్ కంటే రెండేండ్లు ముందుగా చదువు ముగించి లాహోరులోనే వుంటున్న క్రాంతి కారి-త్యాగ పురుషుడు.

# నౌజవాన్ భారత సభ ఏర్పాటు

భగవతీ చరణ్‌ను ప్రోత్సహించి లాహోర్‌లో 'పంజాబ్ నౌజవాన్ భారత సభ' ఏర్పాటుకు కారణమైనాడు భగత్‌సింగ్. ఇతర క్రాంతి కార మిత్రులు అందుకు సహకరించారు. యశపాల్, సుఖదేవ్, ధన్వంతరీ, ఎహసాన్ ఇలాహీ, రామకృష్ణ మొదలగు యువకులెందరో ఆ సభలో సభ్యులు.

దేశ స్వాతంత్ర్యంకోసం సాయుధపోరాటమే శరణ్యం అనే భావాన్ని ప్రజల్లో ప్రచారం చేయటం, కాంగ్రెసువారి చేతకాని రాజకీయాన్ని వివరించడం, జనంలో మతమౌఢ్యాన్ని తొలగించి కులమతాలకు అతీతంగా మానవులందరూ సమానమనే భావాలను ప్రచారం చెయ్యడం, ఆ సంస్థయొక్క ప్రధాన లక్ష్యాలు.

నౌ జవాన్ భారత సభ ప్రధాన కార్యదర్శి భగత్‌సింగ్. ప్రచార కార్య దర్శి భగవతీ చరణ్. వారిద్దరు యెందరో నూతన యువకులను ప్రోత్సహించి ఆ సంస్థలో చేర్చారు. ఆర్థికంగానూ భగవతీ చరణ్ సంస్థకు తోడ్పడేవాడు. ఉత్సాహ మున్నా డబ్బు లేంది పని కాదుకదా.

దేశాభిమానం నాకు కద్దని
వొట్టి గొప్పలు చెప్పుకోకోయ్,
పూని యేదైననూ ఒక మేల్
చేసి జనులకు చూపవోయ్.

అని మహాకవి గురజాడ అన్నమాటకు ఉదాహరణగా తమ ఆలోచ

నలను కార్యరూపంలో పెట్టడానికి పూనుకొన్నారు. తమ ప్రాణాలనే లెక్కచేయని ఆ వీరయువకుల పట్టుదల సామాన్యమైందికాదు. అనేక సభలు నిర్వహించారు. అందులో భగత్‌సింగ్ ఇతర మిత్రులతోపాటు దేశస్థితిగతుల గురించి ఘాటుగా ప్రసంగించేవాడు. అనేక గ్రంధాలు-పత్రికలు చదివినవారి ఉపన్యాసాలు సత్యమైనవిగా బలంగా వుండేవి.

కాంగ్రెసు ఉద్యమం 1922 లో ఆగిపోయిన కారణంగా ఉత్సాహం ఆపుకోలేని పంజాబు ప్రముఖనాయకులు సైతంవీరికి చేయూతనిచ్చేవారు. ఆ సంస్థలో కార్యనిర్ణయానికి, నిర్వహణకేకాక గౌరవానికీ సభ్యులందరు సమానం.

రాజకీయ ప్రసంగాలేకాక సాంఘిక ప్రయోజనంకోసం వివిధమతాలలోని ఛాందసాలను ఆయామతాల వ్యక్తులతోనే తూర్పార పట్టించేవారు. హిందువులు, ముస్లింలు, సిఖ్ఖుయువకులు ఉత్సాహంతో పాల్గొని కార్యక్రమాలు నిర్వహించేవారు.

వీరిని ఎదిరించే మతపెద్దలను వీరూ ఎదిరించేవారు. కొద్ది కాలంలోనే సభకు మంచిపేరువచ్చి ప్రోత్సాహసహకారాలు లభించసాగాయి.

మతసంప్రదాయాలను ఎగతాళిచేయటంలోభాగంగా ముస్లింల 'హలాల్' పద్ధతిలో కోసిన జంతుమాంసాన్ని, సిఖ్ఖుల పద్ధతి 'జట్కా' (ఒకేకత్తిదెబ్బకు తల తెగాలి) పద్ధతి, హిందువుల సాధారణపద్ధతి మాంసాలను కలగలిపి ఒకే పద్ధతిలో వండి ఏ అభ్యంతరంలేకుండా కులం మతం ఆచారం బేధాలు పాటించకుండా తినేవారు. భగవతీచరణ్ గుజరాతీ బ్రాహ్మడు. యశపాల్ పంజాబీ వైశ్యుడు. ఆవు, పందిమాంసాలను కలిపి వండేటంతటిదూరం వెళ్ళేవారు. సాధారణంగా ఉప్మా, కిచిడీతోనే విందులు నడిచేవి.

కాంగ్రెసునాయకులు జాతిని సంఘటితపరచినా వాళ్ళు మతాలను కాదన లేదు, కులాభిమానాలు వదల్లేదు. అన్ని కులాలనూ, మతాలను, దేవుళ్ళనూ గౌర వించాలి అనేవారు. వారి విధానానికి ఎదురు నౌజవాన్ భారత్‌సభ.

కులమతాలు ఆయా దేశాల్లో కాలాల్లో గణనీయమైనపాత్ర వహించినవి. పరస్పరం ద్వేషాన్ని-ప్రేమను, మంచినీ-చెడునూ బాగానే పెంచినై. ఇప్పటికీ అవి బలంగా పాతుకొని విశ్వమానవ సమాజాన్ని ముక్కలు ముక్కలుగా విభ జించి కల్లోలపరుస్తున్నవి. అజ్ఞానకాలంలో మతం, విజ్ఞాన వికాసంతో మతాలు ఎగిరి పోతవి. మనందరిదీ ఒకేమతం ఒకే కులం; అదే మానవత్వం—అనే భావం వారిది.

## కర్తార్ సింగ్ జయంతి

కాంగ్రెస్‌దేశ స్వాతంత్ర్యకోసం కాక ప్రజల హక్కులకోసం ఆంగ్ల ప్రభుత్వాన్ని దయనీయంగా ప్రార్థించి పుచ్చుకోవటానికి ప్రయత్నిస్తుండగా, 'సాయుధ పోరాటంతోనే స్వతంత్రం సాధ్యం. సాధించుకుందాం రండి' అని దేశ ప్రజలకు సాహసంతో పిలుపునిచ్చింది 'నౌజవాన్ భారత్' సభ. అది భగత్‌సింగ్ వాణి. భగవతీచరణ్ బాణి.

ఆ సభ అమరవీరుడైన 'కర్తార్‌సింగ్' జయంతి ఉత్సవాన్ని జరప డానికి పూనుకుంది. 1915 గదర్‌వీరుల్లో కర్తార్‌సింగ్ ఒకడు. పద్దెనిమిదిఏండ్ల యువకుడు. దేశ స్వాతంత్ర్యంకోసం తిరగబడ్డాడు. పట్టుబడి బెదరకుండా దేశ ప్రజలకు వీరసందేశమిచ్చి ఉరిశిక్షతో అమరుడైనాడు. ఆ సందర్భంలో ప్రభుత్వం

రాజద్రోహ నేరంమోపింది 5 వేలమందిపైన, 5 వందల యువకుల మెడలకు ఉరి తాళ్ళు బిగించింది. 809 మందికి ఆజన్మఖైదు విధించింది.

కర్తార్ సింగ్, భగత్‌సింగ్‌కు ఆదర్శం ।

బహుప్రయాసతో కర్తార్ సింగ్ దాక చిన్నఫోటో సంపాదించాడు భగత్ సింగ్. దాన్ని అందంగా పెద్దచిత్రం గీయించాడు భగవతిచరణ్. గ్రిండలా హాలులో సమావేశం, పెద్దసంఖ్యలో ప్రజలు ప్రముఖులు పాల్గొన్నారు ఆ అమర వీరునికి నివాళులర్పించటానికి.



చిత్రపటాన్ని ఖద్దరుగుడ్డతో కప్పిఉంచారు. భగవతీచరణ్ భార్య దుర్గా దేవి, అతనిసోదరి సుశీలాదేవి తమచేతి బొటనవేళ్ళను చీల్చి ఆ వస్త్రంపై రక్తాన్ని చిందించారు. తర్వాత తెరతొలగింది. కర్తార్‌సింగ్ పటాన్ని పుష్పమాలల్తో అలంక రించారు. భగవతీచరణ్, భగత్‌సింగ్ గంభీరమైన ప్రసంగాలు చేశారు. జనాన్ని స్వ తంత్ర పోరాటానికి సంసిద్ధపరచటం ఆ వీరపూజ లక్ష్యం.

అందుకు ముఖ్యుడు వీరభగత్‌సింగ్ !

# భగత్ పరారీ జీవితం

భగత్‌సింగ్ ప్రవర్తన అతని ఇంట్లోవాళ్ళకు నచ్చలేదు. దేశ భక్తిని వాళ్ళువద్దనలేదు, కాని విప్లవమార్గాన్ని ఆమోదించలేదు. అతని అమ్మ, నాయ నమ్మ పెళ్ళిచేయటానికి తొందరపడసాగారు. ఇంటికి పెద్దవాడు. ఇంటిపట్టునఉండని వాడు. అందుకే ఆ తొందర. వారి ఒత్తిడివల్ల కిషన్‌సింగ్ సంబంధాల వేటలో పడ్డాడు. మంచి సంబంధమొకటి కలిసివచ్చింది, కొడుకును ఒత్తిడి చేయసాగాడు పెళ్ళిచేసుకొమ్మని, తిట్టాడు, కొట్టాడుకూడా.

నాకు స్వతంత్రంగా బ్రతికేశక్తి ఏర్పడేవరకు పెళ్ళిచేసుకోను, అని ఖచ్చితంగాచెప్పేసి వచ్చాడు. ఇంటికి వెళ్ళటం మానేశాడు. ఆ తల్లికి కొడుకు చేజారుతున్నట్లు బెంగపట్టుకుంది.

కొడుకు ఇంటికి రాకున్నా తండ్రి బస్తీకి వచ్చినప్పుడల్లా భగత్‌కు అతని మిత్రులకు తిట్లే దీవెనలయ్యేవి. తనతండ్రి తిట్టిన కొత్తతిట్లు వినిపిస్తూ, కొట్టిన దెబ్బలుచూపిస్తూ నవ్వేవాడు భగత్.

మొదటే దుస్తులపై శ్రద్ధలేనిమనిషి, మరీ అశ్రద్ధకు లోనయ్యాడు - ఓ పైజమా లేదా లుంగీకట్టుకొని వొదులులాల్చీ వేసుకొని అదోలా ఆలోచిస్తూ కనిపించేవాడు. మిత్రులు హోటళ్ళలో ఉన్నప్పుడు వారిముందున్న ప్లేటులోంచి ఓ రొట్టెతీసుకొని పప్పుతోపాటుగా తినేసేవాడు. ద్వారకానాథ్ గ్రంధాలయ అధికారి శాస్త్రి ఉండెనా మరీ ఇది. అతనిముందున్న ప్లేటు మొత్తం లాగేసుకునేవాడు.

"చూడండండయ్యా ఈ జాటు (కాపు) చేస్తున్న అన్యాయం" చేతులెత్తి అని నవ్వేవాడు. మరోప్లేటు తెప్పించేవాడు. అతడు యువకుడు, విప్లవ అభిమాని. అతనివల్ల ఎన్నోపుస్తకాలు చదవడానికి, ఎందరో మిత్రులు ఉద్యమానికి లభించారు.

నౌజవాన్ భారతసభ క్రమంగా జయచంద్ర మాస్టారు చేతిలోనికి వెళ్ళి క్రియాశూన్యమైంది. అటు ఇంటిలోను ఇటు సంస్థలోను విసుగువల్ల ఒకనాడు ఢిల్లీకి వెళ్ళిపోయాడు భగత్‌సింగ్.

## ఆజాద్‌తో కలయిక

ఇల్లు వదలివెళ్ళడం తేలికే. కాని ఆకలిని చల్లార్చుకునే మార్గమే కష్టం. జయచంద్ర విద్యాలంకార్ రికమండేషన్‌తో ఢిల్లీ 'అర్జున్ పత్రిక' కార్యాలయంలో ఉద్యోగం సంపాదించుకున్నాడు. జీతంలేనిపని, కాలం గడుస్తుంది చాలనుకున్నాడు.

అక్కడ పనిచేస్తూనే కాన్‌పూర్ 'ప్రతాప్' పత్రికా సంపాదకుడైన గణేశశంకర విద్యార్థితో సంప్రదించాడు ఉత్తరాలద్వారా, అతని ఆమోదం లభించగానే అక్కడికి వెళ్ళిపోయాడు. గణేశ్‌శంకర్ కాంగ్రెసువాది అయినా తీవ్రవాద ఉద్యమకారులకు సహకరిస్తుండేవాడు. అన్నిభావాల రచనలకు తన పత్రికలో స్థాన

మిచ్చేవాడు. బలవంత్ అనే పేరుతో భగత్‌సింగ్ రచనలుకూడా అందులో అప్పు డప్పుడు కనిపించేవి.

9 ఆగస్టు 1925 ఉత్తర ప్రదేశ్ (H. R. A.) విప్లవకారులు కాకోరీ వద్ద రైలుదోపిడీ చేశారు. ఆ వీరయువకుల్లో అనేకులు పట్టుపడ్డారు. తప్పించుకొని తిరుగుతున్నవారిలో అజాద్ చంద్రశేఖర్ ముఖ్యుడు. బందీలైన మిత్రులకు శిక్షలు పడకముందే జైలునుంచి విడిపించాలనే ప్రయత్నంలో కాన్‌పూర్ వచ్చాడు. ఇంత కాలం ఝాన్సీలో రహస్యంగా ఉన్నాడు.

అతన్ని చూస్తేనే గణేష్ శంకర్ విద్యార్థి "నువ్వు పండిత్‌జీని చూడా లని ఆత్రపడుతున్నావ్ కదా బలవంత్ నీ కోరిక తీరనున్నది" అన్నాడు అజాద్‌ను ఆహ్వానిస్తూనే.

చేస్తున్న పని ఆపి తలెత్తి అందంగా హుందాగా ఎదురుగా నిలిచివున్న నూతన యువకుని వైపు ఓ క్షణం చూసి "ఒహో! క్రాంతి దేవత! పండిత చంద్ర శేఖర ఆజాద్" అంటూ ఆనందంతో చేతులు చాచి ముందుకు కదిలాడు భగత్ సింగ్.

"వాహ్! తమ్ముడూ బాగా దొరికావ్, నేనూ నీ అన్వేషణలోనే వున్నాను" అంటూ అతన్ని గుండెల కదుముకున్నాడు ఆజాద్.

రెండు నదులు రెండు అగ్నిపర్వతాలు ఏకమయినట్లయింది.

ఒకే రకమయిన ఆశయాలున్న వారు ఎంతలో ఏకమౌతారు. వారి స్నేహం ప్రగాఢమైంది, ఉద్యమం బలపడింది. దేశం లాభపడింది. వారి త్యాగం చరిత్ర కెక్కింది.



## వీర మరణాలు

భగత్ కృషివల్ల పంజాబ్ "నౌజవాన్ భారత సభ" ఆజాద్‌కు ఆర్థికముగా ఎంతగానో సహకరించింది. కాకోరి క్రాంతికారులను విడిపించాలని అతడెంతగా శ్రమించినా అంతా వృధే అయ్యింది.

రాజబహద్దూర్ జె. బెనర్జీ ఈ కేసులో ప్రభుత్వ పక్షం న్యాయవాది. అతని అల్లుడు మణీంద్రనాథ్ విప్లవకారి. పార్టీ ఆదేశంతో బెనారస్ నడివీధిలో మామను మణీంద్ర కాల్చాడు. అయితే అతడు బతికిపోయాడులెండి. గుండు గురి తప్పి గాయపడ్డాడు.

పండిత గోవింద వల్లభపంత్, సి.బి. గుప్త నేరస్థుల వైపున వాదించి కీర్తిగడించారు. 3 మే 1926 నుండి 12 ఫిబ్రవరి 27 వరకు ఏకధాటిగా కేసు నడిపారు. చివరికి కోర్టు తీర్పు ఇలా వెలువడింది. ప్రవాస శిక్షలు, ఆజన్మ ఖైదులు పదునాలుగేండ్లనుంచి అయిదేండ్ల వరకు శిక్షలు పడినవారు కాక, మరణశిక్షపడిన వారు నలుగురు. వారు రాంప్రసాద్ బిస్మిల్, రాజేంద్రలాహిరీ, అశ్‌ఫాక్ ఉల్లా రోషన్‌సింగ్ అనువారు. అందులో మొదట 17-12-1927 నాడు 'గోండా' జైలులో రాజేంద్రలాహిరీని ఉరితీశారు. అతని అంతిమలేఖ ఇది.

"దేవుని బలిపీఠానికి మా రక్తం అవసరం వచ్చినట్లనిపించుతున్నది. మృత్యువు అనేదేమిటి? అది కేవలం జీవితంయొక్క అవతలి దెస మాత్రమే. ఒకవేళ చరిత్ర మార్పు అనేది నిజమే అయితే మా చావు వ్యర్థంకాదనే భావిస్తున్నాను. అందరికీ నా నమస్కారములు. మీ-రాజేంద్ర"

గోరఖ్‌పూర్ నుంచి వెలువడే ప్రముఖ పత్రిక 'స్వదేశ్' సంపాదకుడు 'రాంప్రసాద్ బిస్మిల్' అదే ఊరి కారాగారంలో 19 డిసెంబర్ 1927 నాడు ఉరి తియ్యబడ్డాడు.

జైలులో తన "ఆత్మకథ" వ్రాసి ఉపాయంగా బయటకు పంపాడు. అది కాన్పూర్‌లో ముద్రింపబడింది.

అతడు తల్లికి వ్రాసిన చివరి ఉత్తరంలో "ఉదాత్త కార్యక్రమంలో వున్నవారు ఒంటరివాళ్ళమని బాధపడే పనిలేదు. ప్రతిచోటా తమకు అభిమానులు లభిస్తూనే వుంటారు, ఒకరో ఇద్దరో దేశభక్తులు" అని వ్రాశాడు. "నేను బ్రిటిష్

సామ్రాజ్య వినాశనాన్ని కోరుతున్నాను" అని పలికి ఉరి కంబాన్ని సమీపించాడు. "వందేమాతరం" అని ఉరి త్రాటికి వ్రేలాడాడు.

రోషన్‌సింగ్ (ఠాకూర్ రామ్ నరేశ్ సింహ)ను అలహాబాదులో ఉరికి తగిలించారు.

"ధర్మయుగ సాధన కొరకు పోరాడి మరణించేవారికి, వనాల్లో తపస్సు చేసి మరణించినవారికి లభించే ఉత్తమగతి లభిస్తుంది అని మన శాస్త్రాల్లో వ్రాసి వుంది" ఇది ఆయన మిత్రునికి వ్రాసిన చివరిలేఖ. అతని గీతమిది.

జిందగీ జిందాదిలోంకీ జాన్ ఐరోషన్
వర నా కిత్‌నే మరే పైదా హోతె జాతే హైం.
(ఎందరెందరో లోకమందున పుట్టి చస్తున్నా
అందులో చైతన్యవంతుల బ్రతుకే వెలుగన్నా!)

అశ్‌ఫాక్ ఉల్లా మరణం ఫైజాబాద్ జైల్లో ఉరిపడే చోటికి ఖురాన్ భుజానికి తగిలించుకొని "కలాం" సూక్తులు పఠించుకుంటూ వెళ్ళాడు.

"నా చేతులు మానవ రక్తంతో యెప్పుడూ యెర్రపడలేదు. చేయని నేరాన్ని నాపై రుద్దారు దేవునిదగ్గరే నాకు నిజమైన న్యాయవిచారణ జరుగుతుంది" అని అన్నాడు.

చివరగా ఈ కవిత చదివాడు-

తంగ్ ఆకర్ హంభీ ఉనకే జుల్మ్‌కె బేదాద్ సే
చల్ దియే సుయే అదం జిందానె ఫైదాబాద్ సే.

ఈ ఘనకార్యమొనరించి ఆంగ్లపాలకులు సంతస పడి వుండవచ్చు. కాని దేశ ప్రజల గుండెలు అగ్నికుండాలైనవి. నా మిత్రులనందరినీ ఒక్కొక్కరినే మృత్యువుకొప్పగించుతూ నేను మాత్రం జీవించివుండాలా? అని ఆజాద్ దుఃఖంతో బాధపొందాడు.

## కేంద్ర విప్లవ సేన (H. S. R. A.) ఏర్పాటు

1922లో కాంగ్రెసు ఉద్యమం విరమించి నీరసించి మద్యపాన నిషేధ, ఖాదీప్రచార కార్యక్రమాలకు పూనుకొంది. 1923లో మితవాద కాంగ్రెసుతో వేరు పడి చిత్తరంజన్‌దాస్, మోతీలాల్ తదితరులు స్వరాజ్యపార్టీ ఆరంభించారు.

ఉగ్రవాద ఉద్యమం తిరిగి ఊపునందుకుంది. భగత్ ఢిల్లీ, లక్నో, కాన్పూర్, పాట్నా తిరుగుతూ విప్లవ మిత్రుల సమీకరిస్తున్నాడు.

విప్లవ మార్గాలను అభిమానించే వారందరూ 1928 సెప్టెంబర్ 8,9 తేదీల్లో ఢిల్లీలోని ఫిరోజ్‌షా తుగ్లక్ పాతకోటలో సమావేశమయ్యారు దీనికి సూత్రధారి భగత్‌సింగ్. అతనికి సుఖదేవ్, శివవర్మ, విజయకుమార సిన్హా సహకరించారు.

బెంగాళ్ "అనుశీలన సమితి" తప్ప దాదాపు ఉత్తర మధ్యభారతపు విప్లవ సంస్థల నిర్వాహకులందరూ పాల్గొన్నారు.

శివవర్మ బెంగాళ్ వారిని పిలవటానికి వెళ్లాడు.ఆ ఒక్క రాత్రి ఇతనిని రహస్యంగా ఏడిండ్లకు తిప్పినవాళ్ళు, కొత్త సంస్థపై పెత్తనం తమకే వుండాలని

కోరటంతో రమ్మనకనే వచ్చాడు. మాటవీరులయిన పంజాబ్ జయచంద్రను,యు.పి సన్యాల్‌ను పిలవలేదు. భగత్‌సింగ్ స్వయంగా ఆజాద్‌ను పిలవడానికి వెళ్తే ఆయన రాలేదుకాని, పార్టీ నియమాలకు కట్టుబడి వుంటానన్నాడు.

పంజాబ్‌నుండి-భగత్‌సింగ్, సుఖదేవ్

ఉత్తరప్రదేశ్‌నుండి-శివవర్మ, విజయకుమార్ సిన్హా, బ్రహ్మదత్తమిశ్రా, జయదేవ్, సురేంద్రపాండే.

బీహార్-ఫణీంద్రనాథఘోష్, మన్‌మోహన బెనర్జీ

రాజస్థాన్-కుందన్‌లాల్

ఇంకా యశపాల్, అజయకుమార్‌ఘోష్ మొదలగువారెందరో వచ్చారు. ఏడుగురు సభ్యులతోకూడిన కేంద్రకమిటీ కార్యనిర్వహణ కొరకు ఏర్పడింది. వారు 1. భగత్‌సింగ్ 2. చంద్రశేఖర్ 3. సుఖదేవ్ 4. విజయకుమార్ సిన్హా 5. శివవర్మ 6. ఫణీంద్రనాథఘోష్ 7. కుందన్‌లాల్.

వివిధ ప్రాంతాలకు కార్యకర్తల ఎంపిక జరిగింది. సంస్థకు సర్వసేనానిగా ఆజాద్ ఎన్నుకోబడినాడు. అంతకుముందు అతనికి విప్లవ కార్యకలాపాల్లో గల విశేష అనుభవం, పిస్తోల్ పేల్చడంలో నేర్పరితనం, గర్వంలేక వీరితో కల్సి వుండడానికి ఒప్పుకోవడం-సంఘ నాయకుని చేశాయి.

అంతవరకే బెంగాళ్‌లో 'అనుశీలన సమితి'; బీహారులో 'యుగాంతర'; యు.పి. ఒరిస్సాల్లో 'హిందూస్థాన్ ప్రజాతంత్రసంస్థ'; పంజాబ్‌లో 'నౌజవాన్ భారతసభ'; ఇంకా కాశీలో 'బెనారస్ రివల్యూషన్ పార్టీ' అనే పేర్లతో విప్లవ సంస్థలు వున్నాయి. ఈ




నూతనసంస్థకు బాగా చర్చించి చివరకు పెట్టిన పేరు 'హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీ' (హిందూస్థాన్ సామ్యవాద ప్రజాతంత్ర సేన) అని, ఇందులో సామ్యవాద, సేన, అనే పదాల ప్రయోగం ప్రత్యేకంగా గమనించదగిన అంశం. సంస్థ ఆశయాలు తెలిపే విధంగా పేరుండాలని ఆ పదాలు పట్టుపట్టి చేర్పించిన ఘనత భగత్‌సింగ్, సుఖదేవ్‌లది.

## సైమన్ కమీషన్‌కు వ్యతిరేక ప్రదర్శనలు

1927లో సైమన్ కమిషన్ ఏర్పడింది. 1928 ఫిబ్రవరిలో ఇండియాలో అడుగుపెట్టింది. సర్ జాన్ సైమన్ అధ్యక్షతన ఏర్పడిన ఈ బృందం భారతదేశంలోని వివిధ నగరాల్లో సంచరించి, ప్రజాభిప్రాయాలు సేకరించి స్వతం

త్రం ఇవ్వవచ్చునో లేదో నిర్ణయిస్తుందట. ఇస్తే ఆ స్వరాజ్యం బ్రిటిష్ ప్రభుత్వానికి లోబడివుండే ఒప్పందం మీదనే. కోరినా కాంగ్రెసు నాయకుల నెవరినీ ఆ బృందంలో చేర్చుకోనందుకు అదీ ఆ కమిషన్‌ను నిరసింప పూనుకుంది.

దేశం మాది, పాలించే హక్కు మాది. నడుమ ఈ కమిషన్ పరిశీలనతో పనేమిటని విప్లవ సంస్థలు వ్యతిరేకిస్తున్నాయి. 3 ఫిబ్రవరికి ఇండియా చేరిన ఆ అధికార సంఘానికి ఎక్కడికి వెళ్ళినా నల్లజెండాలు 'సైమన్ గో బ్యాక్' చీత్కారాలు ఎదురయ్యాయి. 8 ఫిబ్రవరిన బొంబాయిలో 'డాంగే'; ఆ తర్వాత మద్రాసులో 'ఆంధ్రకేసరి' టంగుటూరి, లక్నోలో 'జవహర్‌లాల్ నెహ్రూ' నాయకత్వాన గొప్పగా నిరసన ప్రదర్శనలు జరిగినాయ్.

"లాహోర్" ఊరేగింపునకు "పంజాబ్ కేసరి" లాలాలజపతిరాయ్ నాయకుడు. నౌ.భా. సభవాళ్ళు కాంగ్రెసువారితోనే కలిశారు. అక్టోబర్ 20 సైమన్ కమిషన్‌కు నల్లజెండాలతో బ్రహ్మాండమయిన నిరసన ప్రదర్శన పోలీసులు లాఠీచార్జీ చేశారు క్రూరంగా. ఘోరంగా గాయపడ్డాడు లాలాజీ. ఆయనే ఊరేగింపు నిలిపివేశాడు, యశపాల్, భగవతీభాయికూడా దెబ్బలు తిన్నారు. అలాంటి వారెందరో.

ఆ సాయంత్రం జరిగిన బహిరంగ సభలో లాలాజీ పాల్గొని బ్రిటిష్ పాలనకు వినాశకాలం దాపురించిందన్నారు. "నాపై పడిన ఒక్కొక్క దెబ్బ బ్రిటిష్ ప్రభుత్వ శవపేటికలపై బిగించే ఒక్కొక్క మేకు" అని గంభీరంగా శపించాడు. ఆయన గర్జనలకు అధికారవర్గం బెదిరిందోలేదోకాని లోతైన గాయాలను చూసి ప్రజలు కన్నీళ్ళు కార్చారు. పత్రికలు ప్రభుత్వాన్ని నిందించినాయి.

ప్రముఖ నాయకులంతా ఖండించారు గాంధీతో సహా. 17 నవంబర్‌నాడు లాలాజీ కన్నుమూశాడు.

"ఇది భారతజాతికి జరిగిన అవమానం" అని విచారించాడు భగత్‌సింగ్ ఆయన లాహోర్ ప్రదర్శనలో ఉన్నదీ లేనిదీ తెలవదు. సైమన్ కమిషన్‌పై రైలు దిగగానే బాంబు వేయాలనే ప్రయత్నంలో వున్నాడు. అందుకు కైలాసపతి తాను పనిచేసే పోస్టాఫీసులో 3 వేలు దొంగిలించి తెచ్చియిచ్చాడు.కాని బాంబింగ్‌కు వీలుకాలేదు.

లాలాజీ స్మృతి సంతాప సభలో కీ.శే. చిత్తరంజన్‌దాస్ (1925లో మరణించాడు) ఆయనయొక్క భార్య బసంతీదేవి "ఒక ప్రముఖ దేశనాయకుని నడివీధిలో నిర్దాక్షిణ్యంగా కొట్టినప్పుడు దేశంలోని యువకులంతా ఏమైనారు?" అని ఆవేదన వెళ్ళబుచ్చుతూ ప్రతీకారాన్ని హెచ్చరించింది.

హెచ్.యస్.ఆర్.ఎ. అందుకు స్పందించి జవాబు ఇవ్వాలనుకుంది. లాలాజీ హత్యకు కారణమయిన పంజాబ్ పోలీస్ సూపరిండెంట్ జె.ఎ. స్కాట్, డి.ఎస్.పి. సాండర్స్‌ల్లో ఒక్కరినయినా కడతేర్చాలని భగత్ ప్రతిన పట్టాడు. సభ ఆమోదించింది. ఆజాద్, సుఖదేవ్, రాజగురు, జయగోపాల్ రంగంలోకి దిగారు. లాహోరు మగంజ్‌పేటలో వొక ఇల్లు అద్దెకు తీసుకున్నారు.

## సాండర్స్ హత్య

పోలీస్‌స్టేషన్ పరిసరాలను, అధికారుల రాకపోకలను ముందుగా రెండు మూడు రోజులు చక్కగా కనిపెట్టివచ్చాడు జయగోపాల్. తర్వాత ప్లాను ప్రకారం




భగత్‌సింగ్, ఆజాద్, రాజగురు, జైగోపాల్‌లతో సైకిళ్ళపై వెళ్ళి సైకిల్ మోటార్‌పై వస్తున్న సాండర్స్‌ను పోలీస్‌స్టేషన్‌ముందే పిస్తోళ్ళ గుండ్లకు బలిచేసి ఎదురువచ్చిన పోలీసులపై కాల్పులు జరుపుతూ తప్పించుకుపోయారు.

లాలాజీ మరణించిన నెలకు 17-12-1928 దినాన ఈ సంఘటన జరిగింది. తమది దొంగపని కాదని, తామెవరో, ఈ హత్య ఎందుకు చేసారో

ప్రజలకు తెలపాలని విప్లవసేన కరపత్రాలు పంచింది మరునాడు. అదేరాత్రి వాల్ పోస్టర్స్ ప్రధాన వీధుల్లో అంటించివచ్చాడు భగత్‌సింగ్ ధైర్యంగా.

"హిందూస్థాన్ సామ్యవాద ప్రజాతంత్రసేన"

నోటీస్—

సామ్రాజ్యవాదులారా జాగ్రత్త!

జె.పి. సాండర్స్‌ను వధించి లాలాలజపతిరాయ్ హత్యకు ప్రతీకారాన్ని చేశాం. ముప్ఫదిమూడుకోట్ల ప్రజలచే సన్మానితుడయిన ఒక ప్రజానాయకుని ఒక ఉద్యోగి కొట్టడం, అతని ప్రాణాలను పొట్టనపెట్టుకోవడం ఎంత శోచనీయమైన విషయం. ఎంత దుఃఖ పరిస్థితి? ఇది భారత యువకులకో సవాల్.

భారత ప్రజలు శవాలు కారని వారిలో ఇంకా రక్తం ప్రవహిస్తూనే వుందని ఈనాడు ప్రపంచానికి చాటాం. దేశ గౌరవాన్ని నిలబెట్టడానికి ప్రాణాలకు తెగించి మేమీ సాహసాన్ని చేశాం.

ఓ దుష్ట ప్రభుత్వమా జాగ్రత్త!

బాధామయ జీవులయిన ఈ దేశప్రజల నొప్పించకు. నీ క్రూర కృత్యాలను విరమించు మేము ఆయుధాలు ధరించకుండా వుండగలందులకు నువ్వు ఎన్నో జాగ్రత్తలు తీసుకుంటున్నావు. అయినా ఈ దేశ ప్రజలకు ఆయుధాలు లభిస్తూనే వుంటాయి. రివాల్వర్లనూ పిస్తోళ్ళనూ సంపాదిస్తూనే వుంటారు. ఈ కొద్ది

ఆయుధాలు సాయుధ విప్లవానికి సరిపడకపోవచ్చును. కాని, జాతీయ అవమానాలకు ప్రతీకారాన్ని తీర్చుకోవటానికి తప్పక సరిపోతాయి.

మా దేశ నాయకులే మమ్మల్ని నిందించనీ, అయినా జాతి గౌరవాన్ని నిలబెట్టేందుకు సదా సిద్ధమై వుంటాము. ఆత్మీయుల నిందలనూ, ప్రభుత్వ క్రూర హింసలనూ సహిస్తూకూడా, ఉరి స్తంభాలకు ఎక్కుతూకూడా మేము సంపూర్ణ మానవత్వం-చైతన్యంతో నినదిస్తూనే వుంటాం. విప్లవం వర్ధిల్లుగాక!

ఒక మానవుడ్ని వధించినందుకు మేం చాల దుఃఖపడుతున్నాం, కాని అతడు దుష్ట ఆంగ్లప్రభుత్వ శరీరంలోని ఒక అంగం. ఈ దుష్టప్రభుత్వాన్ని అంతంచేయటం అవసరం బ్రిటిష్ ప్రభుత్వం ప్రపంచ ప్రభుత్వాలలోకెల్లా క్రూరమైనది.

మానవ రక్తాన్ని ప్రవహింపజేసినందుకు చింతిస్తున్నాం. కాని క్రాంతిని అభిమానించినప్పుడు మానవరక్తాన్ని చిలకరించక తప్పదు.

ఒక మానవుని మరో మానవుడు దోచుకోవటానికి వీలులేని న్యాయ సమ్మతమైన సాంఘిక ప్రభుత్వ వ్యవస్థ నిర్మాణం కోసం మేం క్రాంతిని ఆహ్వానిస్తున్నాం.

విప్లవం వర్ధిల్లాలి. సం॥ బలరాజ్,

సేనాపతి-పంజాబ్

18 డిసెంబర్ 1928 (హి.సా.ప్ర. సేన)

ఈ ప్రకటనతో ప్రభుత్వానికి జడుపు పుట్టింది. ప్రజలకు ధైర్యం కలిగింది. విప్లవకారులపై సానుభూతి పెరిగింది.

# లాహోర్ నుండి పరారీ

వ్యాపారం కోసమని ఇండియాలో ప్రవేశించి కూటనీతిలో పాలకు లయిన ఆంగ్లేయులపై దేశీయుల ఎదురుదెబ్బలు ఏదో ఓ మూల సదా తగులు తూనే వున్నాయి. వాళ్ళు శిక్షలు వేస్తూనేవున్నా విప్లవకారులు రెచ్చిపోతూనే వున్నారు. చెలరేగిన కార్చిచ్చును ఆపడం ఎవ్వరితరం.

సాండర్స్ హత్యతో మళ్ళీ అరెస్టులు పెరగడం సహజం. వెంటనే విప్లవకారులు తప్పించుకుపోవాలి. అందుకు డబ్బు అవసరం. హత్య చేసిన రాత్రి మిత్రబృందానికి తిండికేలేదు. ఆజాద్ కోరికగా జయగోపాల్ ఎక్కడో పది రూపాయలు అడిగితెస్తే హోటల్ పదార్థాలతో ఆపూట గడిపారు. యశపాల్ తాను ఉద్యోగంచేసే గోపీచంద్ భార్గవ నడిగి 200 రూపాయలు తీసుకొచ్చాడు.అది సరిపోదు. సుఖదేవ్ వెళ్ళి దుర్గాదేవివద్ద 500 రూపాయలు అడిగితెచ్చాడు. అప్పు డామె భర్త భగవతీచరణ్ మీరట్ కుట్ర వారెంట్ కారణంగా కలకత్తా వెళ్లారు.

ఆ డబ్బుతో క్రాంతికారులంతా పయనమయ్యారు. ఆజాద్,భగత్‌సింగ్ రాజగురు పోలీసుల దృష్టిలో పడ్డారు కాబట్టి బయటకు వెళ్ళడం కష్టంగా వుంది.

నా విషయం నేను చూసుకుంటాను మీ జాగ్రత్త మీరుపడండి అన్నాడు ఆజాద్. భగత్‌ను నగరం దాటించే విషయంలో దుర్గాదేవి సహాయం కోరాడు సుఖదేవ్.

గడ్డం నున్నగా గొరిగి సన్నటి మీసాలు, సూటు హేటుతో అచ్చం సంపన్నుడయిన దొరబాబులా తయారయ్యాడు భగత్‌సింగ్. అతని నౌకరుగా



వేషం మార్చాడు రాజగురు. ఉదయం ఆరుగంటలకు ప్రయాణం. దుర్గాదేవి ముఖానికి బాగా పౌడర్ దట్టించి చీర ఫ్యాషన్‌గాకట్టి ఎత్తుమడమల బూట్లు తొడిగి వారివెంట బయల్దేరింది. శచిబాబును భగత్ ఎత్తుకున్నాడు.

ఎంత ప్రమాదకర సాహసిక సన్నివేశమో అది. కలకత్తాకే వెళ్లారు లక్నోలో రైలుమార్చి.

అదే రైలు మరో బోగీలో రామనామాంకితమైన పసుపురంగు

వస్త్రాన్ని కప్పుకొని ఒక యువక సాధూమహరాజ్ ప్రయాణం చేస్తున్నాడు. ట్రైన్ ఆగినప్పుడల్లా రాజగురు అటు దొరబాబుకు ఇటు సాధుజీకి అవసరాలు సమకూరుస్తున్నాడు. అతడు నౌకరుకు తగినట్లు మూడవ క్లాసు పెట్టెలో ఎక్కాడు

ఆ సాధును చూసి భగత్ ఆశ్చర్యంతో 'అరె పండిత్ జీ!' అన్నాడు సంతోషంతో. అవును అతడు చంద్రశేఖరఆజాద్ అతడు మధ్యలోనే దిగిపోయాడు.

## కలకత్తాలో

దుర్గాదేవి, భగత్‌సింగ్ కలకత్తాలో భగవతీచరణ్ దగ్గరికే వెళ్ళారు సుశీల ఇంటికి. ఆమె లాహోర్ ఉద్యోగం మాని కొన్నాళ్లుగా కలకత్తాలోని ఒక శేఠ్ జీ కూతురుకు ట్యూషన్ చెప్పుతూ వుంది. విప్లవకారులకు ఆశ్రయమివ్వటమే కాక ఆమె మిగిల్చిన డబ్బంతా పార్టీకే ఇచ్చేది. విద్యార్థులు తమ ఉపకార వేతనాలిచ్చేవారు. విజయకుమార్ పత్రికా విలేకరిగా కుదిరి నెలకు 200 వరకు సంస్థకిచ్చేవాడు. అభిమానుల చందాలు సరేసరి.

భార్య మిత్రునితో రావటం చూసి ఒక్క క్షణం స్తబ్ధుడైనాడు చరణ్. తర్వాత భార్య భుజంపై చేయివేసి అభినందించాడు. "ఇప్పుడు నిన్ను అర్థం చేసుకున్నాను" అన్నాడు. ఆయన ఉదాత్తుడు. చెల్లెను అభిమానించి రాజకీయాలు చర్చించేవాడు. ఇన్నాళ్ళు భార్యను పల్లెటూరి మహిళగానే భావించాడు. ఈనాడు ఆమె చేసిన సాహసం చూసి తనకు తగిన గృహిణి అనుకున్నాడు. ఇంతటి ఉన్నత వ్యక్తిని దేశభక్తుని ప్రభుత్వ గూఢాచారి అని ప్రచారం చేశాడు జయచంద్ర. స్వార్థం ఎంత చెడ్డది.



భగత్‌సింగ్ తన చేతులను భగవతీచరణ్ పాదాలపై ఆనించాడు.ఆయన ప్రేమగా మిత్రుని లేపి కౌగిలించుకున్నాడు.

సుశీలాదేవి భగత్‌సింగ్‌ను తన మేనల్లుడిగా ఇంటివాళ్ళకు పరిచయం చేసింది. కలకత్తాలో అప్పుడు మోతీలాల్ అధ్యక్షతన కాంగ్రెస్ మహాసభలు. జనంతోపాటు గూఢాచారులూ అధిక సంఖ్యలో చేరుకున్నారు. పగలంతా ఇంట్లో గడిపి రాత్రిపూట విప్లవకారులను కల్సుకోవటానికి వెళ్ళేవాడు భగత్. అతనికి అనారోగ్యమని చెపుతూ ఇతరులకు అనుమానం రాకుండా అతని మంచం క్రింద

ఉత్తుత్త ముందుసిసాయించేది సుశీలాదేవి. సాహసం సమయోచిత ప్రజ్ఞ విప్లవకారులకు ముఖ్యం.

ఒకసారి జయచంద్ర వీధిలో కనిపించి సాండర్స్ హత్యకు అభినందించి, "భగవతీచరణ్ విషయంలో జాగ్రత్తసుమా ఇక్కడే ఉన్నాడట" అని హెచ్చరిస్తూ తానూ విప్లవ సంఘంలో కలుస్తానన్నాడు. గురుదేవుని మూతిపై ఒక గుద్దు గుద్దుదామనుకున్నాడు భగత్. కాని ఎలాగో కోపం ఆపుకొని తిరిగివచ్చాడు.

ఆ రోజుల్లోనే బెంగాలీ విప్లవకారుల జట్టు ఒకటి జైలునుంచి తప్పించుకొని వచ్చి బాంబుల నిర్మాణం ఆరంభించింది. జయచంద్రకంటె శూరులువాళ్ళు! ఆ నిర్మాణ విధానం తెల్సుకొని ఆగ్రా వెళ్ళి బాంబుల తయారీ ఆరంభించాడు భగత్.

## బాంబుల తయారీ

ఆగ్రాలో రెండు వీధుల్లో రెండిండ్లు విప్లవ సంస్థ అద్దెకు తీసుకొని బాంబుల నిర్మాణం ఆరంభించింది. సుఖదేవ్, కుందన్‌లాల్ ఆ విద్యలో నిపుణులు. ఆగ్రా అప్పుడు క్రాంతికారుల కూడలి అయింది. వివిధ ప్రాంతాల క్రాంతికారుల్లో రాజకీయాలు చర్చించుకునేవారు. బెంగాల్‌నుంచి యతీంద్రనాథ్ సహాయకుడుగా వచ్చాడు.

ఆజాద్ అక్కడే వున్నాడు. మంచి ఆంగ్ల పుస్తకాలు తెచ్చి చదివించుకొని విని విషయచర్చలో పాల్గొనేవాడు. పిస్తోల్ గురిచూసి కాల్చడం, వేట అతనికి ప్రియం. తాను మాంసం తినకున్నా మిత్రులు తినేవారు. వారికి చక్కగా తెల్సిన

పంట కిచిడీ చెయ్యడం. అందులో కొన్ని మాంసంముక్కలు వేసేవాడు భగత్. ఆజాద్ తినేసమయంలో వాటిని ఏరివేసి అన్నం తినేవాడు. నవ్వుతూ మిత్రులా ముక్కలు తీసుకునేవారు.

'ఓ బసంతీ' అనే పాట పాడేవాడు భగత్‌సింగ్. అది ఆపి ఈ వీర గీతాలు పాడించుకునేవాడు ఆజాద్.

దుష్మన్‌కీ గోలియోంకా హం సామ్‌నా కరేంగే
ఆజాద్‌హీ రహేంగె హం ఆజాద్ హీ రహేంగే.

(శత్రువుల తుపాకి గుండ్లకు ఎదురు నిల్చెదము
స్వేచ్ఛగా వుంటాము మేము స్వేచ్ఛగా వుంటాం.)

సరఫ్ రోషికీ తమన్నా అబ్ హమారే దిల్ మెహై
దేఖ్‌నాహై జోర్ కితనా బాజుయే కాతిల్ మెహై.

(ప్రాణాలతో చెలగాటమాడే కోరిక ఇప్పుడు మా
హృదయాల్లో వుంది.
హంతకుల భుజాల్లో ఎంతటి బలముందో చూడాలనివుంది)

"అమ్మా! మాకు వీడ్కోలు ఇమ్మా-విజయధ్వజం
ఎగరవేయడానికి పోతున్నాం."

అనే ఇష్టమైన మరో పాటను భగత్, రాజగురు, బచ్చన్‌లతో వీలయినప్పుడల్లా పాడుమనేవాడు-ఆజాద్.

"అదుగో పోలీసులు వస్తున్నారు విజయధ్వజం పట్టుకొని" అని రాజ గురు రాగంతీస్తూ అందరిని నవ్వించేవాడు.

ఆగ్రాలో బాంబులు తయారౌతున్న కాలంలోనే సుఖదేవ్ లాహోర్ లోనూ, శివవర్మ యు.పి.లోనూ బాంబుల నిర్మాణం చేబట్టారు.

## వీరులకు వీడ్కోలు

పేరుకు ఆంగ్ల ప్రభుత్వం దేశీయ ప్రతినిధులకు ప్రభుత్వంలో భాగ స్వామ్యం కల్పిస్తానంటుంది. వరుసగా ప్రజలను అణచివేసే బిల్లులను అమలు పరుస్తున్నది.

ఈ వసంతకాల సమావేశంలో ప్రజానాయకులు అంగీకరించకున్నా మరో రెండు బిల్లులు వైస్రాయి ప్రత్యేక అధికారంతో ఆమోదించబోతున్నట్లు తెల్సింది. అప్పుడు తమ అసమ్మతి తెలపాలని కేంద్ర విప్లవసేన నిర్ణయించింది.

మొదట భగత్‌సింగ్‌ను, జయదేవకపూర్‌ను పంపాలనుకున్నారు. పిదప కపూర్ స్థానంలో రాజగురు మార్చబడ్డాడు. సంఘ భవిష్యత్ కోసం ఆజాద్, భగత్‌సింగ్ 'యాక్షన్'లో పాల్గొవద్దనే చర్చ వచ్చింది. కాకోరీ వీరుడు బటుకేశ్వర దత్తు తానే పాల్గొంటానని పట్టుబట్టాడు దత్తునూ విజయకుమార్‌సిన్హాను పంపించాలనే నిర్ణయం జరిగింది.

అప్పుడు సుఖదేవ్ లేడు. ఆ తర్వాత భగత్‌సింగ్‌తో వాదన మొదలు పెట్టాడు.

"అసెంబ్లీలో బాంబు పేల్చటానికి నీకు బదులుగా ఇతరులను పంపే ఏర్పాటు ఎందుకు జరిగింది?"

"ఉద్యమ రక్షణం కోసం నన్ను వెళ్ళవద్దని ఆపుచేశారు"

"ఈ మాటలు నాకు చెప్పకు. నీ ఆప్తమిత్రునిగా చెప్పుతున్నాను. నీ కాళ్ళను నువ్వే నరుక్కుంటున్నావు. నీకు అహంకారం పెరిగింది. ఈ మార్గం నిన్ను ఎక్కడికి లాక్కుపోతుందో తెల్సుకో జాగ్రత్త. నువ్విలా పతనం చెందుతుంటే చూస్తూ ఊర్కోలేను"



సుఖదేవ్ మాటలకు భగత్‌కు కోపం వచ్చింది. బాధతో కూడిన కోపముతో అన్నాడిలాగా భగత్. "అసెంబ్లీ బాంబు యాక్షన్‌కు నేనే వెళ్తాను. నన్నే పంపాలి. నువ్వు నన్ను ఘోరంగా అవమానించావ్. అందుకు నిన్నేమీ అనను. ఇక ఎప్పుడూ నువ్వు నాతో మాట్లాడకు" అని లేచివెళ్ళాడు. సుఖదేవ్ చాలాసేపు ఏడ్చాడు.

భగత్‌కు ప్రాణంమీది తీపితో పిరికితనం చేరిందని సుఖదేవ్ అలా హెచ్చరించాడు. కాని, అది అతని భ్రమే అనటానికి విజయకుమార్‌సిన్హా యొక్క ఈ మాటలు చాలు. "భగత్‌సింగ్ విప్లవోద్యమంలో ప్రాణాలర్పించటానికి ఎల్లప్పుడూ సిద్ధంగా వుండేవాడు. తప్పించుకునే అవకాశాలెన్నో వున్నా తానుగా అరెస్టుకావాలని, అట్లా విప్లవ సంస్థ ఆశయాలను ప్రపంచానికి చాటిచెప్పి భారతీయులను స్వాతంత్ర్యపోరాటానికి తయారుచేయాలనే అతడు నిర్ణయించుకున్నాడు. అతని శక్తి అపారం అమరం"

నాడు సుఖదేవ్ ఢిల్లీకి వెళ్ళి భగవతీచరణ్‌తో భగత్‌ను ఆఖరిగా చూడాలంటే ఈరోజే వీలు. వదినకుకూడా చెప్పండి-అన్నాడు.

భగవతీచరణ్ కలకత్తానుంచి కుటుంబంతో కొన్నాళ్ళక్రితమే లాహోరుకి చేరాడు. సెలవులని సుశీలా వచ్చింది అన్నవెంట.

సుఖదేవ్ మాటవింటూనే భగవతీభాయి ఇంట్లోచెప్పి అతనివెంట ఢిల్లీకి బయలుదేరాడు. వెంట దుర్గాదేవి సుశీలా వచ్చారు. వారిని కుదిసియాబాగ్‌లో ఉంచి వెళ్ళి భగత్‌సింగ్‌తో వచ్చాడు సుఖదేవ్.

దుర్గాదేవి అతని క్షిష్టమని తెచ్చిన సంత్యాలు, రసగుల్లాలు భగత్‌కు తినిపించింది. ఇద్దరు స్త్రీలూ అతనికి అక్షతల వీరతిలకం దిద్దారు. ఆశీర్వదించారు. ఎవరూ ఏమీ మాట్లాడుకోలేదు. అతడు పాల్గోబోయే సాహసచర్య వివరాలేవీ వారికి తెలియవు. కాని ప్రమాదం ఎదుర్కోబోతున్నాడని తెల్సు. కొంతసేపటికి గంభీరంగా లేచేసరికి కన్నీళ్ళతో వీడ్కోలు చెప్పారు.

## అసెంబ్లీలో బాంబు

ఆనాడు 8 డిసెంబర్ 1929.

ఢిల్లీ అసెంబ్లీ (పార్లమెంట్ అనే పదం ఇదీ ఒక్కపే నాడు)లో రెండు బిల్స్ ప్రవేశపెట్టబోతున్నారు.

1) పబ్లిక్ సేఫ్టీబిల్ (ప్రజారక్షణ చట్టం)

2) ట్రేడ్ డిస్ప్యూట్స్ బిల్ (కార్మికుల హక్కుల రద్దు చట్టం)

వాటిలో మొదటిది ప్రజల హక్కులను, రెండవది కార్మికుల సమ్మె చేసే హక్కులను హరించేది.

విప్లవవీరులు ముందుగానే వెళ్ళి ప్రేక్షకుల స్థానంలో కూర్చున్నారు గ్యాలరీలో.

ప్రభుత్వ పక్షపు కన్సర్వేటివ్ పార్టీ నాయకుడయిన జాన్ సువర్డ కెదురుగా ప్రతిపక్షనాయకుల కుర్చీలున్నవి. అంతకుముందే కాంగ్రెసు ఆ రెండు బిల్లులనూ ఓడించింది. ఇంటర్‌వెల్ వరకు అందరూ చర్చలు విన్నారు. తర్వాత

జాన్ సువర్టు లేవి పైన్రాయి ప్రత్యేకాధికారంతో వాటికి ఆమోదం తెల్పనున్నారు. అతని కుర్చీ వెనక చెక్కగోడకు 'ఢాం'మని శబ్దం వినిపించింది. వెంటనే మరొక బాంబు అక్కడే పేలింది. జాన్ ముందు బల్లపై పిస్తోల్ కాల్పులు, వెంటనే పులి వంటి జాన్ భయంతో కంపించి పిల్లిలా బల్లక్రింద దూరాడు.



సభ్యులంతా గుండె దడతో బయటకు పరుగెత్తారు. తమ స్థానాలనుంచి కదలనివారు ముగ్గురు. 1) విఠల్‌భాయ్‌పటేల్, 2) మోతీలాల్‌నెహ్రూ 3) మహ్మదాలీ జిన్నా.

హాలునిండా పొగ కాపురు కమ్మింది. అలజడి కొంత శాంతించేసరికి పొగ మబ్బులోంచి ఉదయారుణ సూర్యకిరణాలవలె ఎర్రటి కరపత్రాలు పరచు కుంటున్నాయి.

విప్లవం వర్ధిల్లాలి! సామ్రాజ్యవాదం నశించాలి!

ప్రపంచ కార్మికులారా ఐక్యంకండి!!

ఆ ధ్వనికి హాలు ప్రతిధ్వనించింది. గ్యాలరీకి రక్షక భటులు పరుగెత్తారు. జనం పరుగుతీశారు. ఇద్దరే వ్యక్తులు నిర్భయంగా నిలిచారు. పోలీసు అధికారి ప్రశ్నకు తామే ఆపని చేశామని చెప్పారు. ఎందుకిలా చేశారు? అంటే 'బ్రిటిష్ వాళ్ళపైకాదు బ్రిటిష్ ప్రభుత్వంపై మా పోరాటం' అని ధైర్యంగా అన్నారు,

భగత్‌సింగ్, బటుకేశ్వరదత్తు చేతులకు సంకెళ్ళువేసి తీసుకెళ్తుంటే అభ్యంతరపెట్టకుండా వెంట నడిచారు. భగత్‌సింగ్ చేతి పిస్తోల్లో అప్పటికి ఆరు గుండ్లున్నై, తలచుకుంటే ఇప్పుడు పోలీసాఫీసర్‌ను లేదా అప్పుడు సువర్టును సునా యాసంగా కాల్చేసివుండేవాడు. అది అతని ధ్యేయంకాదు. నిరసన నిర్భయంగా ప్రదర్శించడం సంస్థ ఉద్దేశ్యం.

ఆ విప్లవ వీరుల నిద్దరినీ చెరో కారులో ఎక్కించి పోలీసుల గట్టి కాపలాతో జైళ్ళకు తీసుకువెళ్ళారు.

దారిలో ఆ కారుకెదురుగా భగవతీ బాబు భార్యతోపాటు జట్కా బండిలో వస్తూ భగత్‌ను చూశారు. అతడు వారిని చూశారు. శచి 'చిన్నాన్నా' అని అరచాడు. ప్రమాదం శంకించి దుర్గాదేవి కొడుకు నోరుమూసింది. భగత్ తల వంచు



కున్నాడు. కారు వెళ్ళిపోయింది. గుర్రపుబండి వెనక సైకిల్‌పై వస్తున్న సుఖదేవ్ కన్నీరు తుడుచుకున్నాడు.

అసెంబ్లీలో నాయకుల చేతుల్లోని కరపత్రాలు విప్లవసేన ఆదర్శాలని చాటుతున్నాయ్.

"హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీ-నోటీస్ :

చెవిటివాళ్ళకుకూడా వినిపించడానికి బాంబులు ప్రేల్చడం అవసరం అని ప్రసిద్ధ ఫ్రెంచి అరాచకవాది అమరవీరుడు 'వేలియా' చెప్పిన సూక్తి మా చర్య ప్రత్యేకతను చాటుతున్నది.

గత పదిసంవత్సరాలుగా బ్రిటిష్ ప్రభుత్వం సంస్కరణల పేరుతో

ఈ దేశ ప్రజలను ఘోరంగా అవమానపరచింది. భారత పార్లమెంట్ అనబడే ఈ సభ ద్వారా బండరాళ్ళవంటి శాసనాలను ప్రజల నెత్తిమీదికి విసరి బాధించిన విషయం వేరే చెప్పనక్కరలేదనుకుంటున్నాం. అవన్నీ మీకు స్పష్టంగా తెలిసిన విషయాలు.ఈనాడు 'సైమన్' కమిషన్ తమకేమో మేలుచేస్తుందని ఎదురు చూస్తున్నారు. ఆ వచ్చే ఎంగిలిమెతుకుల కోసం పరస్పరం కొట్లాడుకుంటున్న సమయములో, ప్రభుత్వం ఈ బిల్లుద్వారా మరోరాయి విసరుతున్నది. ప్రజారక్షణచట్టం, కార్మికుల హక్కు రద్దు చట్టం, శాసనంచేసి తన దమన నీతిని బలపరచుకొంటున్నది. ఇంకా వచ్చే సమావేశంలో ప్రెస్సుశాడిషన్ బిల్లు తేనున్నదట. కార్మిక నాయకులను ఇష్టంవచ్చినట్టు అరెస్టుచేయడం ఈ ప్రభుత్వ విధానాన్ని, స్వభావాన్ని తెల్పుతున్నది.

కష్టానికీ అవమానానికీ జాతి మొత్తం గురవుతున్న ఈ క్లిష్ట పరిస్థితిలో "హి.సా.ప్ర.సేన" తన బాధ్యతను గుర్తించి తన సైన్యాన్ని ఈ (బాంబు) చర్యకు ఆదేశించింది దీనిద్వారా మేం ప్రభుత్వాన్ని హెచ్చరిస్తున్నాం-చట్టం పేరుతో ఆడుతున్న ఈ కపట నాటకాన్ని ఇంతటితో ఆపేయాలని, విదేశీ దోపిడీ దారులయిన ఈ సామ్రాజ్యవాద ప్రభుత్వం యొక్క చట్టాల ముసుగును చించి వేయాలి. ప్రజా ప్రతినిధులను మేమొకటి కోరుతున్నాం. మీరు ఈ పార్లమెంట్ మోసపు ఆకర్షణను వదలుకోండి. మీ మీ నియోజక వర్గాలకు వెళ్ళి ప్రజలను విప్లవానికి సిద్ధం చెయ్యండి! ప్రజలను-విదేశీ ప్రభుత్వ దమన నీతిని, దోపిడీని వ్యతిరేకించే పోరాటానికి లేపండి. భారత ప్రజల తరఫున అభివృద్ధిని నిరోధించే నియం

కృత్వాన్ని బలపరచే ఈ శాసనాలకు వ్యతిరేకంగా, లాలాలజపతిరాయ్ హత్యకు నిరసనగా మేమీ చర్య తీసుకుంటున్నామని విదేశీ ప్రభుత్వానికి తెలియజేస్తున్నాం.

మానవ జీవితాన్ని పవిత్రమైందిగా మేం భావిస్తున్నాం. ప్రతివ్యక్తీ పూర్ణ స్వాతంత్ర్యాన్ని అనుభవించగల ఉజ్వల భవిష్యత్తును మేం కోరుకుంటున్నాం. తప్పనిసరియై మానవ రక్తాన్ని (అప్పుడప్పుడు) ప్రవహింపచేయవలసి వస్తున్నందుకు చింతిస్తున్నాం. కాని, తిరుగుబాటుద్వారా సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని కోరుకుంటున్నప్పుడు, ఒక మానవుడు మరో మానవుని దోచుకోవడానికి వీలులేని సమసమాజాన్ని రూపొందించుకొనే సమయంలో ఎంతో కొంత రక్తపాతం తప్పదు.

సం॥ బలరాజ్

8 డిసెంబర్ 1929 కమాండర్ ఇన్ చీఫ్.

## కోర్టు విచారణ

లాహోర్ రెండవ కుట్ర (సాండర్స్ హత్య), అసెంబ్లీ బాంబు ప్రయోగం ఒకరి చర్యలే అని కరపత్రాలతోనేకాక పిస్తోలు దెబ్బల పరిశీలన వల్ల తేలిపోయింది. భగత్‌సింగ్, అతని సహచరులపై ఆంగ్లప్రభుత్వం కోర్టు విచారణ ఆరంభించింది.

ప్రస్తుత విషయాన్ని పరిశీలిద్దాం.

అసెంబ్లీలో బాంబుప్రేల్చి అధికారి హత్యకు సంకల్పించారని ప్రభుత్వ ఆరోపణ.

నిజానికి వ్యతిరేకించాలి. కాని, కోర్టుకు కండ్లుండవు చెవులుంటా యం టారు, ఆనాటి కోర్టులకు అవి రెండూలేవు. ఉన్నది స్వార్థం, ప్రభుభక్తి, కసి, కాఠిన్యం, భయం.

'దేశమెవరిది? శిక్షలెవరికి?'

"బలవంతులు దుర్బల జాతిని బానిసలను కావించారు. నర హంతకులు ధరాధిపతులై, చరిత్రమున ప్రసిద్ధికెక్కిరి."

ఆంగ్లేయుల చరిత్రా అంతేకదా.

"ఒక వ్యక్తిని మరొక్కవ్యక్తీ, ఒక జాతిని వేరొకజాతీ పీడించే సాం ఘిక ధర్మం, ఇంకానా ఇకపై చెల్లదు."

అనేది మన విప్లవకారుల ధ్యేయం-

అందుకే కోర్టులో అన్నాడిలా భగత్‌సింగం.

"విప్లవాన్ని వ్యతిరేకించేవారు కేవలం పిస్తోళ్ళు, బాంబులు, కత్తులు రక్తపాతమే విప్లవం అనుకుంటున్నారు. ఇవి విప్లవానికి సహకరించేవి మాత్రమే, కేవలం ఆయుధాలే విప్లవంకాదు. వీటివెనుక సామాజిక, ఆర్థిక, రాజనీతి పరిస్థితు లను పూర్తిగా మార్చుకోవాలన్న బలమైనకోర్కె ఉంటుంది. అదే నిజమైన విప్లవ శక్తి." అదీ విప్లవ నిర్వచనం.

## పార్టీకి ప్రమాదం

భగత్ మిత్రులను విడిపించడానికి ఆజాద్ చంద్రశేఖర్ తీవ్రంగా కృషి చేస్తున్నాడు రహస్యజీవితం గడుపుతూనే.

అసెంబ్లీ బాంబు చర్య తర్వాత ప్రభుత్వం పోలీసుపటాలాన్ని, గూఢా చారి బలగాన్ని విపరీతంగా వదలిన కారణంగా గాలింపుచర్య లెక్కువైనవి. అదే ఏప్రిల్ 13 తేదీ రాత్రి లాహోర్ బాంబుల ఫ్యాక్టరీ పట్టుబడింది. సుఖదేవ్, జయ గోపాల్, కిశోరీలాల్ అరెస్టయినారు, మే 14 తేదీన షహజాన్‌పూర్ (ఉత్తర ప్రదేశ్‌లోని పట్టణమైనా పంజాబుకు ఢిల్లీకి దగ్గరగా ఉంది) కర్మాగారం పట్టుబడి శివవర్మ, జయదేవకపూర్, డా॥ గయాప్రసాద్ చిక్కిపోయారు.

ఫణీంద్రనాథ్ కలకత్తాలో అత్తవారింట పోలీసులకు చిక్కి ప్రాణ భయంతో క్షమాభిక్ష ఆశతో వారికి లోబడ్డాడు. (ఇలా లోబడడం విప్లవకారులకే కాదు సామాన్యులకైనా వ్యక్తి బలహీనతగా కన్పిస్తుంది. కాని పోలీసుల హింసలు యమలోకాన్ని తలపించేవి. వాటికి తట్టుకొని రహస్యాలను కాపాడటం కష్టం. ఇంకా లేని నిందలూ అంగీకరించుతారు ఖైదీలు అప్పుడప్పుడు బాధలు భరించలేక, ఫణీంద్రనాథ్ పోలీసులతో విడవబడినా, ఆ నేరానికి పగబట్టి విప్లవకారులైన యోగేంద్ర శుక్ల, వైకుంఠశుక్ల అతన్ని వెంటాడి ప్రాణాలను లెక్కచేయక చంపారు కత్తితో పొడిచి, చంపారు. వైకుంఠశుక్ల 1935లో గయ జైల్లో ఉరితీయ బడ్డాడు. నిజానికి ఫణీంద్ర 1914 నాటి విప్లవకారుడు. ఆజాద్, భగత్‌లకు నమ్మకంగా మెదలినవాడు. కాని కాలం అతన్ని మార్చివేసింది-కడకు కడతేర్చింది.)

ఫణీంద్ర వెల్లడించిన రహస్యాల కారణంగా యతీంద్రనాథ్‌దాస్, కమలనాథ్‌తివారీ, వైద్యనాథసింహ, సురేంద్రపాండే, లలితమోహనబెనర్జీలను సుల భంగా బందీలను కావించారు. మిగతా క్రాంతికారులు తప్పించుకొని పారిపోయారు.

ఆజాద్ ఆ విషమకాలంలో విచారంతో ఝాన్సీ, కాన్‌పూర్, గ్వాలి

యర్‌లలో తిరిగాడు. భగత్‌సింగ్ ఇతర బందీలను విడిపించడానికి ఎంతగానో ఆరాట పడ్డాడు. పత్రికల్లోని వార్తలు చదువుతున్నాడు.

“మానవజీవితం అమూల్యమైందనీ, దాన్ని త్రుంచివేసే హక్కు ఎవ రికీ ఉండరాదని భావించడంలో మేం ఎవరికీ తీసిపోం, మేము వ్యతిరేకించేది ఒక జాతినో మతాన్నో వ్యక్తినోకాదు, సామ్రాజ్యవాదమే మా బద్ధశత్రువు, ఆ దుష్ట విధానాన్ని అంతంచేయడానికే మేం పోరాడుతున్నాం.”

భగత్ స్టేట్‌మెంట్స్ చదివి గర్వంతో పొంగిపోయేవాడు, విచారంతో నిట్టూర్చేవాడు. మిత్రులను రక్షించుకోవాలి. ఉద్యమాన్ని ముందుకు నడిపించాలి అని పరితపన.

ఆదేసమయంలో భగవతీచరణ్ తన స్నేహాన్నికోరి సహకరిస్తానని వచ్చినా అనుమాన భయంతో మొదట కాదన్నాడు. అప్పుడు వీరిపార్టీ ఆర్థికంగా కష్టాల్లోఉంది. బహుప్రయాసతో అప్పుల్తో నడుపుకొస్తున్నాడు ఆజాద్.

కాశీరాం, యశపాల్ మిత్రుడు. అతనికి ఖైదీ జయదేవకపూర్ స్నేహి తుడు. అతనిద్వారా ఢిల్లీ కార్యకర్త కైలాసపతిని కల్సుకుని సంప్రదించారు చరణ్-యశపాల్. దుర్గాదేవి విప్లవకారులకు చేస్తున్న సేవలు చూశాడు స్వయంగా కాశీ రాం. భగవతీచరణ్ సుగుణాన్ని ఉద్యమాలకుచేసే సహాయాన్ని గూర్చి విన్నాడు కైలాసపతి. ఖైదీల సమాచారం తెల్సుకోవడానికి వచ్చిన వైశంపాయన బచ్చన్‌తో ఆజాద్‌కు వర్తమానం పంపాడు పతి.

నవంబర్‌లో ఆజాద్ ఢిల్లీలోని కుదిసియాబాగ్‌లో భగవతీచరణ్,యశ

పాస్‌లను కల్పుకున్నాడు. గతాన్ని మరవండని స్నేహ హస్తాన్ని అందించాడు ఆజాద్ 'హిందూస్థాన్ ప్రజాతంత్ర సంస్థ'లో పనిచేసిన కాలంలో భగవతీచరణ్, భగత్, యశపాల్ నౌజవాన్ భారతసభ నడిపారు. హెచ్.ఆర్.ఎ. కరపత్రాలనూ వీరు పంచారు 1925—26లో.

ఆజాద్, భగత్ వీరులను విడిపించే యత్నంలో పూర్తిగా తాము సహకరిస్తామన్నాడు భగవతీచరణ్. తమకు వైస్రాయి ఇర్విన్ ప్రయాణంచేసే ట్రేన్‌క్రింద బాంబు పేల్చాలని వుందని చెప్పాడు. అక్టోబర్‌లోనే ఆ పని జరిగేది కాని, గణేశశంకర విద్యార్థి కోరికవల్ల కొంతకాలం ఆగినామన్నాడు చరణ్.

నవంబర్ తేదీ అంగీకరించాడు ఆజాద్. కాని ఆపని జరగలేదు. తిరిగి డిసెంబర్ 23 తేదీ నిర్ణయించుకున్నారు.

అదే తేదీన గాంధీ ఇర్విన్ చర్చలున్నాయి. వాటి ఫలితాన్ని బట్టి 24 డిసెంబర్ నుంచి జరిగే లాహోర్ కాంగ్రెసు సభల్లో కాంగ్రెసు ఉద్యమ నిర్ణయాలు జరుగుతవి. ఆ సభలకు అధ్యక్షుడు సోషలిస్టు భావాలుగల జవహర్‌లాల్ కాబట్టి కొంతకాలం వైస్రాయికి ప్రమాదం తలపెట్టకండి. చర్చలు వికటిస్తే దేశానికే నష్టం—అని గణేశశంకర్ కోరటంతో కాంగ్రెసుపై విశ్వాసం లేకున్నా మిత్రుని కోరికను తప్పనలేకపోయాడు ఆజాద్.

వెంటనే భగవతీభాయిని అత్యవసరంగా పిలిచి విషయం చెప్పి ప్రస్తుతానికి బాంబు పేల్చడం విరమించండన్నాడు. కార్యకర్తలు చర్చించి అదే సరి అన్నారు. పార్టీముద్ర. కరపత్రం ఇచ్చివెళ్ళాడు చరణ్.

యశపాల్ అంగీకరించలేదు. జమ్మూ, రోహతక్‌లో లేఖారాం, శర్మ

అతో పాటు ప్రయూపసతి బాంబులు నిర్మించి తెచ్చారు. రైల్వే లైనులు పరిశీలించి ప్రమాద స్థలాన్ని ఎంచుకున్నారు. ఇంతవరకే ఒకసారి పట్టాలక్రింద బాంబు పాతి మళ్ళీ తెచ్చారు యాక్షన్ ఆగటంతో. ఇప్పుడు పనులన్నీ ముగించేవున్నారు ఆపటం ఇష్టంలేదు. కాంగ్రెసుతో మనకేమిటి మన పని మనది-అన్నాడు. అంగీక రించాడు భగవతీచరణ్.

యశపాల్, భాగారాం వెళ్ళి మధుర-ఢిల్లీ లైనులో పాండవుల ఖిల్లా దగ్గర వైస్రాయి ట్రైన్ క్రింద బాంబుపేల్చారు. వైస్రాయి మరణించకున్నా పడకనుంచి ఎగిరిపడి బెదిరిపోయాడు. అతని సెక్రటరీ స్పృహ తప్పాడు. ఒక సిపాయి కాలిచచ్చాడు. ఒక పెట్టె తునాతునకలైపోయింది.

చరణ్‌పై మీరట్ కుట్ర (1915) యశపాల్‌పై లాహోర్ 2వ కుట్ర (1919) వారెంట్సున్నవి. అయినా ఇంత సాధించారు.

గాంధీ-ఇర్విన్ చర్చలు విఫలమయినా, లాహోర్ సభల్లో గాంధీజీ వైస్రాయి భక్తిని ప్రకటించి విప్లవకారులను నిందించాడు. భగత్‌సింగ్ మాత్రం మిత్రుల ధైర్యానికి సంతసించాడు.

ఆజాద్ కోపగించాడు యశపాల్ తనను కలవడానికి వచ్చినప్పుడు.తన మాట వినలేదనికాదు, చెడుపని చేశారనికాదు, పార్టీ ఆదేశాన్ని కాదని మెదలి నందుకు అతని కోపం. యశపాల్ క్షమాపణ కోరటంతో శాంతించి, వారి కర పత్రం విషయంలో లక్నో వెళ్ళి భగవతీభాయిని కలిశాడు.

# బాంబు దర్శనం

గాంధీజీ 'యంగ్ ఇండియా' సొంత పత్రికలో తన లాహోర్ ప్రస గాన్ని 'బాంబు మార్గం' పేర ప్రచురించాడు. దానికి జవాబుగా 'బాంబు దర్శన వీరు ప్రచురించ పూనుకున్నారు. ఇంతవరకు పంచిన కరపత్రాలు మంచి ప్రభావ చూపినవి అందుకే ఈ ప్రయత్నం. ముగ్గురు మిత్రులు ఇతర క్రాం కారులు బాగా చర్చించి కరపత్రం రూపొందించారు. రచన భగవతీ చరణ్. తోడ డింది యశపాల్. సలహాలు సంతకం ఆజాద్‌వి. అతడే స్వయంగా వెళ్ళి కాన్పూ రులో ముద్రించుకొచ్చాడు.

దేశమంతటా ఆ కరపత్రాలు ఒకేనాడు పంచబడి గొప్ప ప్రభావా కల్గించాయి. సంస్థకు అభిమానులు పెరిగారు.

భగత్‌సింగ్ ఆ కరపత్రం చదివి ముగ్ధుడైనాడు.

"మా మార్గం మీకు నచ్చకపోవచ్చు. అంతమాత్రాన నిందించ న్యాయంకాదు. మీ సత్యాగ్రహం ఒక్క ఆత్మశక్తిద్వారానే ప్రయత్నించ అదే మార్గాన్ని మేం ఎందుకనుసరించాలి. విప్లవకారులు సత్యంకోసం, న్యాయ కోసం, దేశ స్వాతంత్ర్యం కోసం చేతనయిన అన్ని మార్గాలనూ అనుసరిస్తా

"దేశంలోని యువకులు నేడు మానసిక దాస్యం నుంచి మతపిచ్చిన బయటపడి విప్లవానికి సంసిద్ధులౌతున్నారు. విదేశీ దాస్య బంధనాలను తెంచు టానికి ప్రయత్నిస్తున్నారు. అన్యాయానికి దోపిడీకి (ఎదురుగా) క్రోధంతో తి బడుతున్నారు. దౌర్జన్యాలకు దిగుతున్నారు. ఇదే విప్లవం కాదుకాని రాబోయే

వానికిది ఆరంభం. ఇది మినహా గత్యంతరంలేదు. ప్రపంచంలోని విప్లవాలన్నీ దౌర్జన్యంతోనే ఆరంభమైనాయి. దౌర్జన్యవాదం, దోపిడీదారుల్ని హడలగొడుతుంది. దీనప్రజలకు ఆత్మవిశ్వాసాన్ని ధైర్యాన్ని సమకూరుస్తుంది. ప్రపంచ ప్రజలకు దోపిడీదారులకు వ్యతిరేకంగా జరిగిన పోరాటాలన్నీ విప్లవ మార్గాల్లోనే నడిచినై. ఆ సిద్ధాంతాన్నే మేం విశ్వసిస్తున్నాం" అవును అదే ప్రపంచ విప్లవ పంథా-అనుకున్నాడు.

"ప్రేమించినవారితో స్నేహం, హింసించినవారిపై ద్వేషంతో పోరాటం సర్వత్రా సహజ లక్షణం. ఈ సహజ లక్షణానికి భిన్నంగా ప్రజలను, ప్రేమతో పోరాడి స్వరాజ్యం సాధించుకొండని చెప్పటంలో అర్థంలేదు. ప్రేమతో శత్రువుల హృదయాలను పరివర్తనం చేయవచ్చునను దృఢ విశ్వాసంగల గాంధీజీ ఇంత వరకు ఎందరి హృదయాలను మార్చగలిగారు"

ఒక్కరిని మార్చలేదు—అని నవ్వుకున్నాడు.

"వైస్రాయి భారతదేశానికి శత్రువు. లాహోరు కుట్రకేసుకు, మీరట్ టకేసుకు, భుసావల్లో జరిగిన హింసాకాండకు ఇతడే కారకుడు. ఇలాంటివాళ్ళు పోతేనే మంచిది."

భగత్ శ్వాస వేడెక్కి ముఖం జేగురించింది!

"గాంధీజీ, నెహ్రూగారు తాము గొప్ప రాజనీతికలవాళ్ళమని అనుకుంటారు. కాని వైస్రాయి కూట నీతివారిని బుట్టలో పడవేసుకున్నది" అతని పెదవులపై చిరునవ్వు విరిసింది.

"దళారీ రాజకీయవాదులకు విదేశీ పాలకులతో రాజీబేరాలకు అహింస

ఒక సాకుగా తయారయింది పూర్ణస్వరాజ్యం తమ లక్ష్యమని(ఇన్నాళ్ళకు)కాంగ్రెస్ (నెహ్రూ) ఈ సంవత్సరమే ప్రకటించటం జరిగింది.విప్లవకారులు అదే లక్ష్యాన్ని 25 సంవత్సరాలుగా కలిగియున్నారు. ఇప్పటికయినా కాంగ్రెసు సరియైన మార్గంలో స్వతంత్రపోరాటం చేస్తుందని ఆశిద్దాం.

విప్లవకారులు చిట్టిపొట్టి సంస్కరణలు కోరువారనుట అన్యాయం, సమూలంగా ఈ వ్యవస్థను మార్చటమే మా లక్ష్యం. కాంగ్రెసే సంస్కరణ వాద ముతో క్రమంగా తన సిద్ధాంతాలను మార్చుకుంటున్నది. అది కోరే సంపూర్ణ స్వాతంత్ర్యంకూడా విదేశీ దాస్యానికి మారుపేరు.

పూర్ణ స్వాతంత్ర్యంకోసమే విప్లవకారులు బలిఅవుతున్నారు. సహాయ నిరాకరణ, అహింస గాంధీ సిద్ధాంతాలు కేవలం భ్రమ. ప్రజలను మోసగించడం. పోరాటంవల్లనే స్వతంత్రం లభిస్తుంది."

ఒక్క నిట్టూర్పు వదిలాడు భగత్‌సింగ్-

పుట్టినవ్యక్తి తప్పక మరణిస్తాడు. తనకోసంగా తాను బతకడం గొప్ప కాదు. తన దేశంకోసం ప్రజలకోసం పరిశ్రమించే జీవితం సార్థకం. ఆ ధ్యేయం తోనే పెళ్ళిని కాదన్నాడు. ఇల్లు వదిలాడు. క్రాంతికారులను కలిశాడు. రెండువిప్లవ సంస్థల స్థాపనకు కృషిచేశాడు. వీరకార్యాల్లో పాల్గొన్నాడు. కఠిన ప్రభుత్వ కారా గారం కటకటాల వెనుక కాలం గడుపుతున్నాడు. మరణశిక్ష పడవచ్చు. తరుణం కల్పిస్తే తప్పిపోవచ్చు-ఎందుకు? ఉద్యమాన్ని ముందుకు నడిపించడానికి. తాను లేకున్నా మిత్రులు విప్లవాన్ని సాగించగలరనే విశ్వాసం ఈ కరపత్రం కలిగిం చింది. అదిచాలు తనకు.

రవి అస్తమించని విశాల సామ్రాజ్యం తమదని గర్వంతో విర్రవీగే ఆంగ్ల ప్రభుత్వం భారతభూమిలో పరాజయంపొంది పలాయనం కాకతప్పదు.

ఈ 'బాంబు దర్శనం'లో ఆజాద్ ఇంతకుముందు వాడిన బలరాజ్ అనే మారుపేరుకాక భగత్‌కు ఇష్టమైన 'కర్తార్‌సింగ్' అనే పేరు వాడాడు. 1915 మొదటి లాహోరు కుట్రకేసులోని గదర్‌వీరుల్లో ఒకడు కర్తార్‌సింగ్. (అదే గదర్‌వీరుల్లో ఒకడైన పృధ్వీసింగ్‌తో సంప్రదించి బొంబాయిలో విప్లవసేన కేంద్రాన్ని ఏర్పాటుచేయటానికి పూనుకున్నాడు ఆజాద్ ఆ తర్వాత)

భగత్‌సింగ్ ఆజాద్‌వలె దేశ స్వాతంత్ర్యంకోసం ఆయుధం చేతపట్టిన పోరాటకారుడు. కర్తార్ అన్నాడుఇలా-

"ఉరిశిక్ష తప్పినా జీవించి ఉన్నంతకాలం పోరాటం వదలకు. బయటకు వెళ్ళేంతవరకు మౌనంగా ఉండకు. మనోధైర్యముంటే జైలుగోడలు నిన్నాపలేవు."

అందుకే కర్తార్‌పై భగత్‌కు అభిమానం. అతని ధ్యేయమే తనది.

## జైల్లో సత్యాగ్రహాలు

లాహోర్ సెంట్రల్‌జైల్లో భగత్‌ను, మియాన్‌వాలీ జైల్లో బటుకేశ్వర దత్తునూ ఉంచారు.

ఆ కాలంలో జైళ్ళ పరిస్థితి దుర్భరంగా ఉండేది. ఆహారంవసతి పరమ దరిద్రంగా ఉండేవి. అందులో "అయినవారికి ఆకుల్లో కానివారికి కంచాల్లో, కాదు-చిప్పల్లో వడ్డించినారు." అన్నట్లు కాంగ్రెసువారికి కల్పించే సౌకర్యాలు విప్లవ ఖైదీలకు కల్పించేవారుకాదు.

మేం రాజకీయ ఖైదీలమేకాని గూండా నేరస్థులం కాదు పరిస్థితులు మెరుగుపరచండి, అని వీరువాదించారు. ప్రభుత్వం వినలేదు. దండివానికి మొండి వాడే మొగడన్నట్లు విప్లవకారులు భగత్, దత్తు నాయకత్వంలో ఒకేరోజు జూన్ 12న నిరసన వ్రతాల నారంభించారు.



వీరికి బయటి సంబంధంలేదు, పత్రికలు చూడనివ్వరు, అయినా బంధు మిత్రులతో రహస్య సమాచారం తెలుస్తుండేది. పత్రికల వాళ్ళెలాగో లోపలి

వార్తలు సేకరించి ప్రచురించేవారు, విశేషవార్తలేకదా పత్రికలకు ఆకర్షణ. అందులో స్వదేశీ పత్రికలు, అంతో ఇంతో దేశభక్తి కలవి.

హింసావాదులను నిందించిన నాయకులు సైతం వారి ఉపవాసవ్రతాలను బలపరచి ప్రభుత్వాన్ని నిందించసాగారు. పత్రికల్లో ప్రకటనలిచ్చారు, తాము ప్రజాధినాధులమని గర్వించే ప్రభుత్వానికి ప్రజలంటే భయమే. జనం తిరగబడితే తామేమీ చేయలేమని వారికితెల్సు. అందుకే నయాన్నో భయాన్నో జనాన్ని ఆకట్టుకునే ప్రయత్నాలు చేస్తుంటారు.

ఖైదీలకు బలవంతంగా ఆహారాన్ని తినిపించసాగారు. వాళ్ళ గొంతుల్లో వేళ్ళుగుచ్చుకుని తిన్నది కక్కేసేవారు. బలవంతంగా గొట్టం నోటిలో జొనిపి ద్రవాహారం ఎక్కించడంవల్ల ఊపిరితిత్తుల్లో చొచ్చి 15 సెప్టెంబర్ 29 నాడు జితేంద్రనాథ్ (68 రోజుల ఉపవాసం) అనారోగ్యంపాలై మృతి చెందాడు. ప్రజల పట్టుదలవల్ల శవాన్ని అతని తమ్ముడు కిషన్‌దాసు కిచ్చారు. కలకత్తాకు తీసుకు వెళ్తుండగా ప్రజలు అభిమానంతో కన్నీటితో అభిషేకించి పూలతో పూజించారు ప్రతి స్టేషన్‌లోనూ, కలకత్తాలో అతని చితాభస్మాన్ని తిలకాలుగా దిద్దుకున్నారు. ఇంతటి త్యాగాలకు అంతటి వీరపూజ ప్రభుత్వ నిరసన.

కోర్టుకువెళ్ళే శక్తికోసమైనా ఉపవాసం వదలి కొద్దిగానైనా తినుమని మిత్రులు భగత్‌కు సలహాలు పంపారు.

పనిదొంగ, తిండిబోతు అయిన నేరస్థుడు బబ్బర్ కూడా క్రాంతికారుల ఆదర్శానికి ముగ్ధుడై భగత్‌ను 'దేవతా' అని పిలువసాగాడు. జైల్లో అలజడి బయట పత్రికల ప్రచారం ప్రజల దుమారంచూసి బెట్టువదలి ఖైదీలకు సౌకర్యాలు అమ

ర్చింది ప్రభుత్వం. త్వరగా న్యాయవిచారణ అయిందనిపించాలని ప్రత్యేక న్యాయ స్థానాన్ని జైలు ఆవరణలోనే ఏర్పాటుచేసి, తీర్పుపై తిరిగి అప్పీలు చేయకుండా ఆర్డర్ జారీచేశారు. రాజు తలిస్తే దెబ్బలకు కొదవా.

## హెచ్. ఎస్. ఆర్. ఎ. క్రొత్త కార్యవర్గం

ఆజాద్ చంద్రశేఖర్ జనవరి 1930 లో కాన్పూర్‌లో విప్లవకారుల సమావేశాన్ని ఏర్పాటుచేశాడు.

దేశ, ప్రభుత్వ, పార్టీ స్థితి గతులపై చర్చించుకున్నారు. తమ కర్తవ్యాన్ని మరోసారి గుర్తించి బలపరచుకున్నారు.

క్రొత్త కార్యవర్గం ఎన్నిక జరిగింది. ఆజాద్ సంస్థకు మొదటి నుంచీ అధ్యక్షుడు సర్వసైన్యాధిపతి. సేనానిగానే ఉంటూ ఇప్పుడు అధ్యక్ష పదవిని, కాకోరీకుట్ర క్రాంతికారుడైన శేర్‌దామోదర స్వరూప్‌కిచ్చాడు. ఆ యిద్దరికీ పర్సనల్ సెక్రెటరీ బాధ్యత భగవతీచరణ్‌ది. ఈ ముగ్గురు కార్యక్రమ నిర్ణేతలు-నిర్వాహకులు, పంజాబ్‌కు-యశపాల్, ఢిల్లీకి-కైలాసపతి (కాశీచరణ్), యు.పి.కి.-వీరభద్ర తివారీ కార్యకర్తలు, ఇతర ప్రాంతాలతో సంబంధాలు పెంచుకోవాలనుకున్నారు. ఈ సమావేశంలోనే 'బాంబు దర్శనం' కరపత్రాలను పకడ్బందీగా దేశమంతటా ఒకేనాడు పంచే కార్యక్రమాన్ని కార్యకర్తలు రూపొందించుకొని బాధ్యతలను స్వీకరించింది.

సంస్థ కార్యక్రమాలకు ఒక సొంతప్రెస్సు కావాలనే అభిప్రాయానికి

వచ్చారు. అత్యవసరమైతే ఒకటి రెండు దోపిడీలు చేయాలని నిర్ణయించారు. సంస్థ కారునుకూడా అమ్మి కష్టంగా నడుపుకొస్తున్నా దప్పటికి ఉద్యమాన్ని ఆజాద్.

మొట్టమొదటి కార్యక్రమం భగత్‌వీరులను విడిపించడం.

# భగత్ సింగ్‌కు ఉరిశిక్ష

1930 జనవరి మొదటి తేదీన ఏర్పడిన ప్రత్యేక న్యాయస్థానం 5 న తేదీన పని మొదలుపెట్టింది. ముగ్గురు (అ) న్యాయమూర్తులు.

తనకు ఏ న్యాయవాదీ వద్దన్నాడు భగత్‌సింగ్. కోర్టులో తిరగబడ్డాడు. ధైర్యంగా ఎన్నో ప్రకటనలిచ్చాడు. ఫలితంలేదు.

ప్రభుత్వ న్యాయవాది 24 గురు విప్లవకారులను నిందితులుగా పేర్కొన్నాడు. వారిపై ఆరోపించిన నేరాలు.

"బ్రిటిష్ చక్రవర్తి ప్రభుత్వాన్ని కూల్చడానికి కుట్రపన్నటం, బాంబుల తయారీ, యుద్ధాలు-దోపిడీలు, హత్యలు."

గట్టి బందోబస్తులో చేతులకు సంకెళ్ళువేసి కోర్టుకు హాజరు పరచేవారు. వీరు బేడీలు వేయొద్దని తిరగబడేవారు, వీరు కొట్టేవారు, జైలు గేటువద్ద గుంపులుగా చేరిన జనం విప్లవవీరులతోపాటు 'వందేమాతరం' 'విప్లవం వర్ధిల్లాలి' అని గట్టిగా నినాదాలు చేసేవారు. క్రోధంతో మండిపోయేవారు-నిస్సహాయులై కన్నీరు కార్చేవారు.

జూన్ నెలలో దేశమంతటా 'భగత్‌సింగ్ విజయోత్సవం' ప్రకటించబడింది. అతని ఫోటోలు యువకులకు ప్రీతిపాత్రమైనాయి.

30 అక్టోబర్ 1930 నాడు శిక్షలను ప్రకటించారు. బంధీలైన ఖైదీలు సంకెళ్ళను వ్యతిరేకిస్తే పోలీసులు నీచంగా హింసించారు.

ఆఫీసర్లు, జడ్జీలు, జనం చూస్తుండగా పశువులవలె నెత్తుర్లు కారేట్లు కొట్టారు ఆ దేశభక్తులను.

బోనులో పడిన సింగాలకు విధించిన శిక్షల వివరాలివి.

నిర్దోషులు కేవలం—ముగ్గురు-జతీంద్రనాథ సన్యాల్, అజయకుమార ఘోష్, దేశ్‌రాజు. మిగతావారిలో తొమ్మిదిమందికి యావజ్జీవ ఖైదుశిక్షలు. 1) విజయకుమార్‌సిన్హా 2) శివవర్మ 3) కిశోరీలాల్ 4) జయదేవకపూర్ 5) మహావీర్‌సింగ్ 6) డా॥ గయాప్రసాద్ 7) కమలనాథ తివారీ మొదలగువారు అండమాన్ దీవుల్లో 14 సంవత్సరాల శిక్ష గడపాలి. కుందన్‌లాల్‌కు 7 సంవత్సరాలు. ప్రేందత్తుకు 5 సంవత్సరములు శిక్ష విధించారు.

భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్‌లను చచ్చేవరకు ఉరితీయాలని తీర్పు చెప్పారు.

ఆ వీరులను విడిపించడానికి విదేశాలుకూడా పెద్ద మొత్తాల్లో విరాళాలు పంపించాయి. మోతీలాల్, జవహర్‌లాల్, రఫీ అహ్మద్ కిద్వాయి, సుభాసుబోసు, బాబా గురుసింగ్‌దత్, మోహన్‌లాల్ సక్సేనా, నారీమన్ మొదలగు నాయకులు జైళ్ళకువెళ్ళి ఆ క్రాంతికారులను కల్సుకొని నైతిక సహాయం అందిస్తామని హామీ ఇచ్చివచ్చారు. ఫలితం ఇది. అప్పుడు దేశీయనాయకులకు ప్రభుత్వంలో వున్న గౌరవం అది.

# భగత్ వీరుల విడిపించే విఫల ప్రయత్నాలు

మిత్రులను జైలునుంచి విడిపించడానికి ఆజాద్ బృందం తీవ్ర ప్రయత్నాలు చేయసాగింది. లాహోరు సెంట్రల్ జైలు సమీపంలో ఒక బంగ్లా అద్దెకు తీసుకొని విప్లవకారులు చేరినారు. సంసార పక్షపు గృహంవలె కనిపించాలని దుర్గాదేవి, సుశీలకూడా అక్కడే ఉన్నారు. భగవతీచరణ్, సుశీల ఇచ్చిన ఆరువేల రూపాయలతో కార్యక్రమం ఆరంభమయింది.

ప్రభుత్వం షేర్‌దిల్ సిపాయిలని విప్లవకారులకు పోటీగా క్రొత్త రక్షక దళాన్ని కార్యరంగంలో దించింది. వారి దగ్గర ఆధునికమైన ఆయుధాలున్నవి. అవి దోచిన తర్వాత జైలుదాడి అంటాడు యశపాల్. వైస్రాయి రైలును ప్రేల్చడంవల్ల భగత్‌ను విడిపించే కార్యక్రమం వాయిదా పడింది. ఇప్పుడింకా ఆలస్యం చేయరాదని భగవతీచరణ్ అభిప్రాయం నిర్ణయం కొరకు భగత్‌సింగ్ దగ్గరికి అతని చెల్లెను పంపారు.

"కళాకారుణ్ని రోజుకో క్రొత్తఆలోచన మొదలుపెట్టవద్దని చెప్పండి. ముందు అనుకున్నపని ముందు జరగాలి. పరిస్థితులను ఆలోచించటానికి, కార్యక్రమం నిర్ధారణ చేయటానికి మోటా (భగవతీచరణ్) తగ్గిపోతాడు. యాక్షన్‌లో వెనక వుంచి, పండిత్‌జీని (ఆజాద్‌ను) ముందుంచండి. రచయితను (యశపాల్‌ను) కరపత్రం వ్రాయమనండి" అని చెప్పి పంపుతూ భగత్‌సింగ్, తమను విడిపించడానికి ప్లానుసైతం గీచిపంపాడు.

సెంట్రల్ జైలునుంచి బోర్స్టల్ జైలుకు పోగా దాడిచేయాలని యశ పాల్ వాదించాడు. కాగా బోర్స్టల్ జైలుముందే యాక్షన్ జరపాలనే భగత్ అభిప్రాయాన్నే ఆజాద్ బలపరిచాడు. 1930 జూన్ 1వ తేదీన దాడికి నిర్ణయించు కున్నారు.

ఈలోగా 28 మే 1930 నాడు భగవతీచరణ్, బచ్చన్ సుఖదేవ్‌రాజ్ అనే ఇద్దరు విప్లవకారులతో కలిసి రావి నదీ తీర అరణ్యంలోనికి బాంబు పరీక్షకు వెళ్ళాడు. ప్రయోగానికి ముందే చేతిలో బాంబుప్రేలి ఘోర దుర్మరణం పాలై నాడు.

మరణానికి ముందు "మరో రెండు రోజుల తర్వాత ఈ మరణంవస్తే బాగుండేది. భగత్‌సింగ్‌ను విడిపించే కార్యక్రమంలో పాల్గొనలేక పోతున్నాననే అని విచారంగా వుంది" అన్నాడు భగవతీచరణ్.

చివరిమాటగా "భగత్‌సింగ్‌ను విడిపించే ప్రయత్నం ఆగటానికి వీల్లేదు" అన్నాడు. అదీ వీర ధర్మం-మిత్రప్రేమ-దేశభక్తి!

ఆజాద్, బచ్చన్, యశపాల్ వెళ్ళి ఆ (అ)మృతవీరుని దుప్పటిలో మూటకట్టి నదీజలాల్లో విడిచారు. జ్ఞాపకార్థం అతని కేశాలు కొన్ని కత్తిరించి తెచ్చాడు వైశంపాయన బచ్చన్.

అలజడి చెందినా, దుఃఖం ఆవరించినా అదంతా మరచి కర్తవ్యాన్ని తలచి ధైర్యం వహించి అనుకున్నదినం జైలుమీదికి వెళ్ళారు. ప్రయోజనం కలుగక పోగా ప్రమాదం కలిగే పరిస్థితిని గమనించి ఆజాద్ 'యాక్షన్' నిలిపివేశాడు.

## దేశభక్తులకు ఉరిశిక్ష

న్యాయం జరుగుతుందన్న ఆశలేకున్నా పుత్ర వ్యామోహం చావక సర్దార్ కిషన్‌సింగ్ ప్రివీ కౌన్సిల్‌కు అప్పీలుచేస్తానన్నాడు.

తనకు శిక్ష తప్పించుకోవాలని లేదని-దేశంకోసం బలికావటంలో ఆత్మ సంతృప్తివుందని, అభ్యర్థన పత్రంమీద సంతకంచేయడానికి సైతం అంగీకరించ లేదు భగత్‌సింగ్-

"ప్రభుత్వం రెండు నాల్కలతో వ్యవహరిస్తున్నది. ఒకవైపు శాంతి వాదులను బుజ్జగిస్తూ, మరోవైపు విప్లవ శక్తులను మట్టుపెట్టాలని చూస్తున్నది. అందువల్ల నీవంటివాడు బ్రతికివుండాలి. విప్లవాన్ని కొనసాగించాలి."అని ప్రాధేయ బడ్డాడు విజయకుమార్ సిన్హా.

అయినా ఆ వీరుడు రాజీపడలేదు. ఏదోగా తండ్రి తెచ్చిన కాగితంపై సంతకంచేశాడు. 29 సెప్టెంబర్ 1929 నాడు కిషన్‌సింగ్ పెట్టుకున్న పిటిషన్ త్రోసివేయబడింది.

1930 వేసవిలో గాంధి ఉప్పు సత్యాగ్రహం-దండి సత్యాగ్రహం కారణంగా ముమ్మరంగా కాంగ్రెసువాళ్ళ అరెస్టులు జరిగినయ్. ఆ పది నెలల్లో 90 వేలమంది జైలుపాలయ్యారు.

వాహ్! ఉప్పు సత్యాగ్రహం, గాంధీజీ కాంగ్రెసు విధానం చూడు. వచ్చారు. జెండా ఎగరేశారు. నినాదాలు చేశారు. అరెస్టయి జైళ్ళలో కూర్చున్నారు. ఇదీ వీళ్ల స్వతంత్రంతెచ్చే పద్ధతి-అని ఆజాద్ విచారం వెలిబుచ్చాడు.

ఆజాద్ తన ప్రయత్నాలు కొనసాగిస్తూనే వున్నాడు. 1931 ఫిబ్రవరి 27 నాడు ఉదయాన అలహాబాద్ ఆల్ఫ్రెడ్ పార్కులో పోలీసులు చుట్టుముట్టగా వీరోచితంగా పోరాడి ఆంగ్ల అధికారులను ఏరేరి హతమార్చి చివరి గుండును తన కణతలో కాల్చుకొని వీరమరణం చెందాడు. పోలీసులకు ఏ పరిస్థితిలోనూ పట్టుపడ ననే తన ప్రతిన చెల్లించుకున్నాడు.

తన మరణవార్తను భరించలేక ఎంతగా వ్యథ చెందుతాడో ఆజాద్ అని విచారించాడు భగత్. కాని ప్రియమిత్రుని సంఘనాయకుని మరణ విషాదాన్ని తానే భరించవలసివచ్చింది.

మార్చి 1931లో కరాచీ కాంగ్రెసు సభలకు ముందు గాంధీని ప్రభుత్వం వదిలేసింది. భగత్ వీరుల ప్రాణాలను కాపాడండంటూ కుప్పలుగా ఉత్తరాలు టెలిగ్రాములూ వచ్చిచేరినాయ్. కాంగ్రెసు నాయకులూ అడిగారు. విప్లవకారులూ కల్పుకొన్నారు.

మార్చి 25-31 తేదీల్లో కాంగ్రెసు సభలు, 23 తేదీన తాను వైస్రాయి ఇర్విన్‌లో చర్చలకు వెళ్ళవల్సిఉంది. మొదటి (12-11-30) రౌండ్‌టేబిల్ సమావేశానికి లండన్ వెళ్ళలేదు. ఈసారి [7-9-31] రెండవ రౌ. టే. సమావేశానికి తప్పకవెళ్ళాలి అనే అధికారి కోరికతో ఒక ఒప్పందం కుదురుతుంది.

అప్పుడు భగత్‌సింగ్‌ను వదిలే విషయం గాంధీజీ ప్రస్తావనకు తెస్తే వైస్రాయి తమ అవసరం కారణంగా తప్పక అంగీకరించవచ్చునని ప్రజలు ప్రజానాయకులు గాంధీని కోరారు. వైస్రాయికి మరణశిక్షలు రద్దుచేసే అధికారముంది.

నేను గ్యారంటీ ఇవ్వలేను. అడిగినా ఫలితం ఉండకపోవచ్చు-అన్నాడు గాంధీజీ. ఆయనకు శాంతి అహింసలపై భక్తి కుదిరినా దేశ స్వతంత్రం కోరుతున్నా బ్రిటిష్ ప్రభుత్వంపై గౌరవంకూడా చావలేదు.

మోతీలాల్ అనారోగ్యంతోఉండి ఇలా చెప్పిపంపాడు. "మీకేసు విషయంలో గాంధీజీ ఏదో చేస్తున్నట్టున్నారు. కొంత వ్యవధిని సంపాదించుకోవటానికై చట్టప్రకారం అప్పీలు చేసుకొనే అవకాశాన్ని వదలుకోవద్దు. మీ అమూల్య ప్రాణాలను రక్షించుకోవాలనే నా ఆశ."

బ్రతుకుతానని-బ్రతకాలనే ఆశ ఎన్నడో వదిలేశాడు భగత్‌సింగ్. చివరికి ప్రభుత్వాన్ని ఒక కోరికమాత్రం కోరాడు.

"మాకు రాజద్రోహం కారణంగా శిక్షలు విధించారు. మేం హంతకులం కాదు. కాబట్టి ఉరిశిక్షలు విధించకుండా మమ్ములను వరుసగా నిలబెట్టి తుపాకులతో కాల్చి చంపడం ధర్మం" అని పంజాబ్ ప్రభుత్వానికి లేఖ వ్రాసాడు. దేశం సంచలనం చెందింది. జనం ఆవేశం ఆవేదనతో ఉప్పెనగా లేచింది. స్వదేశీ విదేశీ పత్రికలు ఈ శిక్షలు అన్యాయమని ఘోషించినై. అయినా ప్రభుత్వంలో చలనంలేదు.

గాంధీజీ తన చర్చల సందర్భంలో భగత్‌వీరుల మరణ శిక్షల రద్దు విషయం తెచ్చాడట.

అందుకు వైస్రాయి "నేను పంజాబ్ ప్రభుత్వానికి తెల్పుతాను. ఆత్మగౌరవం పట్టింపుతో వాళ్ళు అంగీకరించరనుకుంటాను. కరాచీ సభలు జరిగేంతవరకు

మాత్రం శిక్షలు అమలు పరచకుండా నిలిపివేసేలా చూస్తాను" అన్నాడట వైస్రాయి. తమ (గాంధీ—ఇర్విన్) ఒప్పందం కాంగ్రెస్‌చే అంగీకరింప జేసుకోవాలనే పన్నాగం, మొదటినుండీ ఆంగ్లేయ పాలకులవన్నీ నక్కజిత్తులే.

"ఉరితీసే ఉద్దేశం ఉంటే సభలకు ముందుగానే కానీయండి. అది దేశంలోని రాజకీయ పరిస్థితిని తెల్పుతుంది. మనమధ్య జరిగిన ఒడంబడికను అంగీకరించడమో త్రోసి పుచ్చడమో కాంగ్రెసు నిర్ణయిస్తుంది." అన్నాడట గాంధీజీ.

మార్చిలో కరాచీలోని కాంగ్రెసు సభల్లో ఆ ఒప్పందాన్ని అంగీకరింప జేశాడు గాంధీజీ.

1931 మార్చి 23 సాయంత్రం భగత్‌సింగ్, సుఖదేవ్, రాజగురు ముగ్గురు రాజద్రోహంకు ఉరిశిక్ష విధించినట్లు, సలక్షణంగా దహనకర్మ కావించినట్లు ప్రభుత్వ ప్రకటన 24 నాటి పత్రికల్లో వెలువడింది.

వల్లభాయి పటేలు కాంగ్రెసు అధ్యక్ష స్థానంలో ఉండగా ఈ వార్త తెలిసింది, ఆ క్రాంతికారులు ఉరిశిక్షలకు సభలో నిరసన కనిపించింది. ప్రజలు పెద్దయెత్తున నల్లజెండాలతో కాంగ్రెసును నిరసిస్తూ నాయకులచుట్టుముట్టారు 1943 లో సుభాష్ చంద్రబోస్ స్థాపించిన ఆజాద్‌హిందూఫౌజ్ సేనలను (హిందూ-ముస్లిం-సిక్ఖు) ముగ్గురుకీ ఢిల్లీ స్పెషల్‌కోర్టు మరణదండన విధించింది. తర్వాత ప్రజల ఆందోళనకు జడుసుకొని వాటిని రద్దుచేసింది. ఇప్పటి గుణపాఠమే అప్పుడు వివేకాన్ని కలిగించి ఉంటుంది. అప్పటి ప్రజల తీవ్రత ఇప్పుడు లేకపోవటం ప్రమాదమయ్యింది. ప్రజాశక్తిని ఎదిరించి నిలిచే బలం దేనికుంది?

# కొంచెం సేపు గతంలోకి

కుమారుని మరణశిక్షకు దుఃఖిస్తున్నప్పుడు ఆ తల్లిదండ్రులకు అర్థమైంది అతడు పెళ్ళివద్దని ఇంటినుండి తప్పించుకొని వెళ్ళివచ్చేటప్పుడు పలికిన మాటల అంతరార్థం.

ఒక జమిందారుగారి అమ్మాయితో కొడుకు పెళ్ళి నిశ్చయం చేశాడు తండ్రి. అత్యవసరంగా కొడుకును లాహోరునుంచి రావాల్సిందిగా కబురుపెట్టాడు.



ఇంటికి రాగానే మామగారి ఐశ్వర్యంగురించి వధువు సౌందర్యగురించి వర్ణించ నారంభించాడు-తనకవేవీ వద్దు వివాహమే వద్దన్నాడు భగత్‌సింగ్.

ఎందుకు? కోపంతో తండ్రి ప్రశ్న.

నాకాళ్ళపై నేను నిలబడగలిగేశక్తి వచ్చేవరకు పెళ్ళి చేసుకునే ప్రసక్తి రాదు-అనేశాడు తండ్రితో. అమ్మతో మాత్రం అసలు నిజం చెప్పేశాడు.

"అమ్మా! ఈ ఇంట్లో నాయనమ్మా మరిద్దరు పిన్నమ్మలు వితంతు జీవితాలను గడుపుతున్నారు. వారికి తోడుగా మరో అభాగ్యురాలిని జతచేయనా?"

ఆనాడు మారుపలుకలేని విద్యావతి ఈనాడు కుమిలి కుమిలి యేడుస్తు న్నది.

గాంధీ-ఇర్విన్ ఒడంబడికకు ముందే 3 మార్చినాడు భగత్‌సింగ్ తన తమ్మునికో లేఖ వ్రాశాడు.

ప్రియమైన కుర్తార్,

ఈరోజున నన్ను చూడడానికి వచ్చినప్పుడు నీ కళ్ళలో నీళ్ళు చూసి నాకు బాధవేసింది. నీ ముఖంలో, మాటలో దుఃఖం కన్పించింది. నిన్నిలా చూడ్డం నాకిష్టంలేదు. తమ్ముడూ, నీ చదువు కొనసాగించు ధైర్యాన్ని వహించు.

నీ వ్యక్తిత్వాన్ని కోల్పోకు. పిరికివానివి కాకు. ఇంతకంటే ఎక్కువ నేనేం రాయగలను. ఏం చెప్పగలను" అని ఉత్తరం చివర ఒక విప్లవ గీతాన్ని వ్రాసి దాని చివరలో మిత్రులకు, దేశభక్తులకు ధైర్య వచనాలు చెప్పి తుది వీడ్కోలు తీసుకున్నాడు.

## సత్యం దాగదు - చావదు

1931 మార్చి 24 ఉదయం 6 గంటలకు ఆ ముగ్గురు దేశభక్తులకు ఉరిశిక్షలు అమలుపరచాలనుకున్నారు మొదట విదేశీ ప్రభుత్వ అధికారులు. సాధారణంగా అలాంటి శిక్షలు ఉదయంపూటే జరపటం ఆచారం. అందుకు భిన్నంగా నియమిత సమయానికి 12 గంటల ముందుగా 23 తేదీ సాయంత్రం 6 గంటలకు ఆ ముగ్గురు వీరులను ఒకేసారి ఉరితీశారు చట్ట వ్యతిరేకంగా.పిరికిపందలకు శూరుల శవాలను చూసినా భయమే. పగటిపూట శిక్ష అమలుపరిస్తే ఆ వార్త తెలిసిన ప్రజలు కల్లోలం సృష్టిస్తారేమో అని అనుమానం-గుండెదడ-అందుకే ఆ ముందు జాగ్రత్త.

విప్లవం వర్ధిల్లాలి !

సామ్రాజ్యవాదం నశించాలి ! !

గట్టిగా నినాదాలుచేస్తూ ధర్మయుద్ధానికి వెళుతున్న వీరసైనికుల్లా ఉరి కంబాలకు చేరుకున్నారు భగత్‌వీరులు. ఆ ధ్వనికి దిక్కులు పిక్కటిల్లినై. జైలు గోడలు మూగపోయి నిలిచినై. తారలుకూడా విస్తుపోయి చూస్తున్నాయి. గాలికూడా స్తంభించిపోయింది.

గదుల్లోని ఖైదీలు కన్నీళ్ళు తుడుచుకున్నారు.

ఆ ముగ్గురువీరుల మృతదేహాలను అదే రాత్రి గోనెసంచుల్లోవేసి మూతులు బిగించికట్టి దొంగదారిగా సట్లెజ్ నదీ తీరానికి చేర్చారు. నమ్మకస్తులైన తెల్లసిపాయిల కొప్పగించి కాల్చేయండని అధికారులు తిరిగి వచ్చేశారు.

ఆ శవాలను చితుల్లో వుంచడానికి బదులు కసితో ముక్కలు ముక్కలుగా నరికి, బూతు మాటలతో తిడుతూ, తన్ని తగలేశారు. వెర్రి ఆనందంతో మద్యం తాగి, కాష్టాలచుట్టూ చిందులేస్తూ డ్యాన్సు చేశారు సిపాయిలు.

ఆ వీరుల కళేబరాలు కాలుతూకూడా భయపెట్టాయికాబోలును, చితి మంటలు పౌరుషాగ్నిలా నాలుకలు చాస్తూ లేచి ఆ దుష్టుల కబళించనెంచాయి కావచ్చును-సగం కాలిన ఆ శవశకలాలను ఆదరబాదరగా నదిలో త్రోసి పరుగందుకున్నారు.

మరునాడు పేపర్లలోని వార్త ప్రజల్లో గుప్పున వ్యాపించింది. రాత్రి వేళ నదీతీరంలో రక్షకభటుల లీలాకేళిని దూరంనుంచి చూసిన కొందరికి అనుమానం కలిగింది. వెళ్ళి చూస్తే చితుల్లో ఉత్తబూడిద తప్ప మానవదేహాల చితా భస్మ చిహ్నాలు కానరాలేదు. అనుమానంతో నదిలో వెదికారు.

సగం కాలి మిగిలిన సాహసమూర్తుల శరీరభాగాలు దొరికి కన్నీరు వరదలయింది వారికి. సగౌరవంగా ప్రజలు ఆ విప్లవమూర్తులకు దహన సంస్కారం కావించారు.

# భగత్ సింగ్ అమరుడు

మరణ శిక్షకు ముందు సిక్కు మతగురువు దైవప్రార్థన చేసుకొమ్మని కోరగా భగత్ సింగ్ ఇలా అన్నాడట-

"నా జీవితంలో దేవుడిని ఎన్నడూ తలచుకోలేదు. దేవుడనేవాడుంటే- నా దేశస్థులు అనుభవిస్తున్న కష్టనష్టాలను చూస్తూ వూరుకుంటున్నందుకు కొన్ని సార్లు ఆ దేవుణ్ని నిందించానుకూడా. ఈ చివరిక్షణంలో మృత్యువుకు యెదుట



నిలిచి దైవాన్ని ప్రార్థిస్తే అతడు నన్ను పిరికిపంద-ఆత్మవంచకుడు అనుకుంటాడు నన్ను ఇప్పుడున్న విధంగానే ఈ లోకంనుంచి వెళ్ళనివ్వండి. ఏ ఒక్కరుకూడా భగత్‌సింగ్ చావుచూసి భయపడిన పిరికిపంద అని నిందించకూడదు"

ఆ మాటలు విన్న గురువు కన్నీరు కార్చాడట. అంతటి ఆత్మ నిష్ఠ ఏ భక్తుల్లో వుంటుంది.

ఎందరి ఆశయాల ఆత్మబలిదానాల ఫలితంగానో మనకు స్వతంత్రం (15 ఆగస్టు 1947) సిద్ధించింది. సంపూర్ణ స్వపరిపాలన (26 జనవరి 1950) ఏర్పడింది. కాని ఇప్పటికీ ఇదేమిటి?

అవినీతి బంధుప్రీతి చీకటి బజారు
అలుముకున్న ఈ దేశం ఎటు దిగజారు?
కాంచవోయి ఈ దుస్థితి-ఎది
రించవోయి ఈ పరిస్థితి!—(శ్రీశ్రీ)

"హిందూస్థాన్-జిందాబాద్ !"

"భగత్‌సింగ్-అమర్ హై !!

